సురేష్ ప్రొడక్షన్స్
ప్రై లిమిటెడ్.



# చినబాబు

డి.రామానాయుడు * ఎ.మోహనగాంధీ

ఆంధ్రప్రదేశ్ సురేష్ మూవీస్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ వెస్ట్ అన్నపూర్ణ సినీ చిత్ర

JAGATI Rs. 2-00 August 1988

33rd Year of Publication




## ఆగస్టు - 1988



ఆకారాలు - పుష్పగుచ్ఛాలు

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఫాల్కే అవార్డ్ గ్రహీత రాజ్‌కపూర్

# నిమ్మతొనలు

తెలుగు మాస్టారు పిల్లలకు గ్రామరు పాఠం చెబుతూ, 'ఏనుగు వర్షములో తడిసెను - ఇది ఏ కాలం ?' - అని అడిగారు భాస్కర్‌ని.

కొంచెం కూడా తడుముకోకుండా 'వర్షాకాలం, సార్' అని టక్కున చెప్పాడు భాస్కర్.

—వై రామారావు

కొణకంచి

ఏమయ్యా, జడ్జీగారింటికి నిన్న నువ్వు బ్రాందీ బాటిల్ పంపావట. నీకు ఏ కేసు గెలవాలనిలేదా ? - అని దండించాడు వకీలు రామనాధం.

'నేను పిచ్చోణ్ణి కాదు, సార్: ఎగస్పార్టీ వాళ్లు పంపించినట్లుగా పంపించాను' - అని చెప్పుకున్నాడు క్లయింట్ గురవయ్య.

—కె నాగేశ్వరరావు

నరసరావుపేట

ఏమండీ ఒక్కసారి తిట్టండి ; నన్ను గట్టిగా తిట్టండి, ప్లీజ్' - ఏమాత్రం పరిచయంలేని సారంగ, తనని బ్రతిమాలుతూ అడగ్గా ఆశ్చర్యపోయింది మాలిని.

'నేను మిమ్మల్ని ఎందుకు తిట్టాలి. మీరేం తప్పు చేశారని ?' - ప్రశ్నించింది మాలిని.

'నేనేమీ తప్పు చేయలేదంటారా? అయితే, మాలినీ,నన్ను ప్రేమించండి"

బిత్తరపోయిన మాలినికి తిట్టాలని కాదు, కొట్టాలనిపించింది.

—జి రాము

నందిగామ

తాయారూ, నీ ఫ్రెండ్స్‌తో చదరంగం ఆడేటప్పుడు ఎప్పుడూ నీవే గెలుస్తూంటావు. మరి, నాతో ఆడినప్పుడు వోడిపోతూ వుంటావేమిటి ? కావాలని వోడిపోతావా?' - అని అనునయంగా అడిగాడు తాయారు భర్త.

'నాకూ కొన్ని నియమాలు వున్నాయండి - గాడిదల్ని ఎప్పుడూ మోసం చేయను,' - అంది తాయారు, - తర్వాత నాలిక కొరుక్కుంటూ !

—భవాని

మచిలీపట్నం

వీళ్ళారివ్వాళ చాలా తెల్లగా కనిపిస్తున్నారండీ - అంది జయ

లక్ష్మి, మంగాత్రిరైన తన భర్తని ఉద్దేశిస్తూ.

'అంతేనోయ్ మరి! ప్రతిపక్షాలు యివ్వాళ వృతికేశాయ్' - అన్నారు మంత్రిగారు చాలా తాపీగా.

—అర్ శ్యామల
విశాఖ-3

శ్రీ రామ్మూర్తి ఎందుకలా అదే పనిగా వాగుతాడు? - అని అడిగాడు గిరీశం, శంకర్ ప్రసాద్‌ని.

'అది వాడి తప్పుకాదు – వంశ ప్రభావం.... రక్తంలో జీర్ణించుకు పోయివుంది'.

'అంటే?'

శంకర్ ప్రసాద్ వివరించాడు: 'వాళ్ల తాత వేలం పాటగాడు. వాళ్ల నాన్న స్కూలు టీచరు. ఇక వాళ అమ్మ అడది.'

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

రేడియోలో లేఖావళి అనౌన్సరు చెబుతున్నాడు: 'అ.... వీరెవరంటే ఒడ్డుమాసంగి నుంచి ఆనందమహీపతి రావుగారట. వారికి మన ప్రసారాలేవీ నచ్చటం లేదట. మిత్రబృదంతో కలిసి మన స్టేషన్ మీద దాడి చేయ నున్నారట.... చూడండి, మహీపతి రావుగారూ, మీరు దాడి చేయ వచ్చు. కాని, ముందుగా స్టేషన్ డైరక్టరుగారి అనుమతి తీసుకోవలసి ఉంటుంది'

—జియస్ శర్మ
అమలాపురం

ప్రసాద్, మగపిల్లలకంటె ఆడపిల్లలే నయం' - అని మనసులో మాట చెప్పుకున్నాడు సూర్యం.

'ఎందుకని?'

'ఎప్పటికైనా వాళ్లు మన యింట్లో నుంచి వెళ్తారు మననెత్తిని కూచోరు కద!'

—కె శేఖర్ బాబు
మైలవరం

# పాఠకుల తీర్పు

ప్రియమిత్రులు యన్నార్ చందూర్ గారికి: నిరుడు, ఢిల్లీలో భారత కల్చరల్ ఇంటిగ్రేషన్ మహాసభల్లో మనమంతా - మీరు, నేను, టివికె శాస్త్రి, రావి కొండలరావు, గరీమెళ్ల రామమూర్తి - కలుసుకుని మనసారా మాట్లాడుకున్న విషయాలు తరుచు గుర్తుకు వస్తుంటాయి. ఆ కార్యక్రమాలన్నీ విజయవంతమై, ఢిల్లీ ఆంధ్రులను, యితరులను ఉర్రూతలూగించాయి.... మాలతీ చందూర్ గారికి నా తరపున, సుమలత తరపున, నమస్కారాలు చెప్పండి. రచనా రంగంలో మూడు దశాబ్దులకు పైగా కృషి చేస్తున్న ఆధునిక రచయిత్రి ఆమె; మేధావుల్లో ఒకరు. ఆమె సాహచర్యం లభించిన మీరు ఎంతో అదృష్టవంతులు. ఆమె 'జవాబులు' నాకూ, సుమలతకూ ఎంతో యిష్టమైన శీర్షిక; వైశాఖి, కృష్ణవేణి, ఓ మనిషి కథవంటి నవలలు మరుపు రానివి.... అట్టహాసం లేకుండా తెలుగుతనానికి ప్రతీకగా వున్న 'జ గ తి' కి పత్రికారంగంలో ఒక విశిష్ట స్థానం ఉంది. ఈసారి ఢిల్లీ సతీసమేతంగా వచ్చి, మా ఆతిధ్యం స్వీకరించండి.

—ఏడిద గోపాలరావు

న్యూఢిల్లీ-1

మాలతీ - చందూర్ గార్లకు: 1988 మే నెల 'జ గ తి', సరిహద్దు గాంధీని స్మరించుకొనే అవకాశం కలిగించింది. మీ 'జ గ తి' ఒక్కసారి సర్వజగత్తును కండ్లకు కనిపింపజేసింది.

—వావిలాల గోపాలకృష్ణయ్య

గుంటూరు-2

గౌరవనీయులగు చందూర్ మహాశయులకు అనేక నమస్కారములతో: తరుచూ మారే నా చిరునామా మీకు ఇబ్బంది కలిగించినట్లయితే క్షమించగలరు. కాని, యిది నా తప్పనిసరి పరిస్థితి. మరో రెండు సంవత్సరముల వరకు యిదే చిరునామా. మీసోదరి....

—అమ్మాజీ సర్కార్

ఆల్‌హస్సా (కెఎస్ఎ)

చందూర్ గార్కి: నాకు బెంగుళూరు ట్రాన్స్‌ఫరయింది. నేను వూటీలో వున్నప్పుడు మీ దంపతులు నా ఆతిధ్యము అంగీకరించలేక పోయారు. కనీసం బెంగుళూరు అయినా వస్తారనుకుంటాను. మీ వస్తువులు దొరికినందుకు చాలా సంతోషము.

—పి విజయలక్ష్మి

బెంగుళూరు-9

# ప్రాచీన సాహితి

అది మితాదరంబు తదనంతర మంచిత రాగమంత ల
జ్జోదయ రమ్యమంత శిథిలోద్యమ మంత నితాంతధైర్య వి
చ్ఛేదము ప్రేమపూరము విశేష వివిక్త విహార మంత నా
హ్లాద కరాంగ సంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే.

—భర్తృహరి



చేరువ పగయును దూరపు మైత్రియు
గావించె నేనియు గార్యహాని
అల్పుతో వైర మన్య నృపాలుతో మైత్రి
యొనరించె నేనియు నొదవు గీడు
త్యాగంబునకు నాత్మభోగంబునకు గాని
విత్తార్జనంబు గావింపరాదు
చాసకు లోనైన ప్రతిభాష లాడిన
బాలతితో భాషింప బోవ దగదు
ఇట్టి నయమార్గ మెరుగక యిచ్చ వచ్చి
నట్లు చరియించు వారికి హాని గల్గు
మదరిపు విఫాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్త సంత్రాణశీల

—వేణుగోపాల శతకం



అన్యాయార్జిత విత్తమున జేయం బూను దానంబు మూ
ర్ఖ న్యాయంబది దాన జేసి ఫలసాకం బేమియున్ లేదు యు
క్త న్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
న్మాన్యంబై తగ బాత్రయోగమున సౌమ్యంబై ఫలించుం దుదిన్

—తిక్కన మహాభారతం

# పాత కేళ్లనాటి పిక్చర్

"ఫోరమ్"

అమెరికన్ చిత్రాలనగా హాలీవుడ్ నుంచి వచ్చే పిక్చర్లని మాత్రమే చూడ టానికి అలవాటు పడ్డవారికి, ఈ ఫిలిమ్ 'ఫోరమ్' ఒక వినూత్న ప్రపంచానికి తలుపులు తెరుస్తుంది. కట్టుకథలూ, కల్పితగాధలూగాక విజ్ఞాన ప్రదమగు శాస్త్రీయ పరిశోధనలనీ, మానవుడు వైజ్ఞానిక రంగంలో చేస్తున్న కృషినీ, మచ్చుకి చూపిన రెండు చిత్రాలూ మహోదాత్మకంగా ఉన్నాయి. వెండి తెర మానవ ప్రగతికీ, వైజ్ఞానిక విద్యా వకాశాల విస్తరణకీ ఎలా సాయపడ గలదో అమెరికన్ సైంటిఫిక్ ఫిలిమ్ ఫోరమ్ వారు, సున్నితమగు వివరణ లలో చక్కగా చూపించారు. 'ఫ్రాంటి యర్స్ ఆఫ్ సైన్స్' అను పేరున, నలభై వైజ్ఞానిక చిత్రాలని విశ్వ విద్యాలయా ధ్యాపకులకి చూబుతున్నారు. వివిధ కాలేజీలలోని సైన్సు లెక్చరర్లు, ప్రొఫె సర్లు వీటిని చూడటానికి ఆహ్వానం పం పారు. మద్రాసులోని అమెరికన్ కాన్సల్ డా॥ సైమన్స్, మద్రాసు యూనివర్సిటీ ఎగ్జామినేషన్ హాలులో సమావేశమైన ప్రముఖులకు స్వాగతం చెబుతూ, సామాన్యులకి వైజ్ఞానిక ప్రపంచాన్ని పరిచయం చేసే ఫిలిమ్ ఫోరమ్ అనగా ఏమిటో చెప్పి, అమెరికా నుంచి ఈ సందర్భంగా వచ్చిన అయిదుగురు విద్యావేత్తలనీ పరిచయం చేశారు. భారతీయ విద్యారంగానికి పూజ్యులైన డా॥ లక్ష్మణస్వామి మొదలి యార్, నేటి ఆధునిక జీవనంలో సైన్సుకి గల ఉత్కృష్ట స్థానం చెబుతూ, అన్ని సైన్సులూ చివరికి ఒకవిధంగా మెడి కల్ సైన్సుతో కట్టుబడి వున్నాయనీ సైన్సు ఎప్పుడూ పుస్తకాల ద్వారా గాక, ఎక్స్‌పెరిమెంట్స్‌తోను, డిమాన్ స్ట్రేషన్స్‌తోను బోధించాలనీ అన్నారు అమెరికా సమాచార శాఖ డైరక్టర్ పాజిన్ వందన సమర్పణతో సభ ముగిసి చిత్ర ప్రదర్శన ప్రారంభ మైంది. 'ది ఫ్లేమింగ్ స్కయ్' - 'ఛాలేంజి ఆఫ్ ది ఓషన్స్' - ఒకటి ఆకా శాన్ని, రెండోది సముద్రాల గురించి చెబుతాయి. చిత్ర ప్రదర్శనానంతరం ప్రేక్షకుల కరతాళధ్వనులే వారి హర్షానికి నిదర్శనం. విజ్ఞాన సాగర తరంగాలపై ప్రతిఫలించిన చంద్రకాం తుల వంటివి ఈ రెండు చిత్రాలూను.

—యన్నార్ చందూర్ సమీక్ష,

'జగతి' - ఆగష్టు 1963

---

ఒక సద్భావన సుమ పరిమళంలా అల్లుకు పోతుంది. — గాంధీజీ

## వెన్నెల కెరటాలు

### లయం - ఆలయం

సౌందర్యం చూసే వాడి కళ్ళల్లో ఉందన్నట్లు, దీని సమన్వయం కూడా గమనించే మనస్సునుంచే రావాలి. ఇన్ని రూపాలలోనూ ఇన్ని రూపాలు గానూ ఒకే చైతన్యశక్తి ప్రకాశంగా చూచే మనస్సుకి ఇన్నిగా తోచవు. అంతా అయిన ఒకటిగానే నిత్యమూ ఉన్నదిగానే తోస్తుంది. అఖండమూ అనంతమూ అయిన చైతన్య రస స్రవంతికి మొదలేదీ తుదియేదీ? దానికి జడ చైతన్యాలని రెండు విభాగాలు లేవు. కాలమే తానైన దానికి భూత భవిష్యద్వర్తమానాలని మూడు భాగాలు లేవు. ఒకచోట గుప్తంగా ఒకచోట ప్రకటంగా చైతన్యం ఆవిష్కారంలో అంతరం ఉంటుంది. జలచరాలు ఖేచరాలు భూచరాలు 800 కోట్ల మానవులు ఇటువంటి ఖండదృష్టి లేదక్కడ. పుట్టుక లేదూ చావూలేదు. అంతా ఉన్నదే, అంతా అయినదే. నిత్యమూ నిరంజనమూ సత్యమూ పరమానందమయమూ ఆ అవలోకన. ఆ ప్రకాశ చైతన్య సమరస సీమలోని ప్రథమ ఈ క్షణమే స్పందనమే ఇచ్ఛాశక్తిగా మొలకెత్తి అవ్యక్తమయిన మూల ప్రకృతి త్రిగుణాత్మకమై ఒకటి రెండై బహుళమైన రీతి తోచడం లేదు. కానీ బహుళంగా ఉన్నది మళ్ళీ ఒకటికా గోరుతున్నది స్పష్టంగానే ఉంది. ఈ ద్వంద్వాలలో ఘర్షణ ఉంది ప్రార్థన ఉంది. ఆలయం ఉంది లయం ఉంది. దైవం ఉంది జీవం ఉంది. పుట్టుకఉంది మరణం ఉంది. జ్ఞానం ఉంది, అజ్ఞానం ఉంది.,

—కేశవ

'మాతృభూమిలో'

### తల్లాప్రగడ

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారు తమ 96వ సంవత్సరంలో ప్రవేశించ బోయే ముందు స్వర్గస్థులయ్యారు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్య వర్గంలో గురువు గారి మనస్సుకెక్కి సంపూర్ణ శిష్య వాత్సల్యాన్ని చూరగొని పరిపూర్ణ జీవితంతో జన్మ చరితార్థం చేసుకొన్న విజ్ఞాన ఖని, ఉత్తమ శీలవంతుడు ప్రకాశరాయుడుగారు. వెంకటరత్నం నాయిడుగారి అంతే వాసిత్వం వీరిని బ్రహ్మ సమాజంవైపు ఆకర్షించింది. బ్రహ్మ సమాజ దీక్షాపరుడై ఆ కార్య కలాపాలలో పాల్గొనడం ప్రచారం చేయటమేకాక అది ప్రధానంగా బహు గ్రంథరచన చేయటం ద్వారా వీరి మార్గంలో ప్రామాణికులయ్యారు. కలకత్తాలో ఎమ్. ఏ. చదివిన శ్రీ

ప్రకాశరాయుడుగారు అక్కడ జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశంలో పాల్గొని గాంధీగారి పిలుపునందుకొని తమ 26వ యేట జాతీయోద్యమంలో ప్రత్యేక పాత్ర వహించటం, మూడు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించటం జరిగింది. వీరు జైలు జీవితం లోను స్వేచ్ఛా జీవితంలోనూ కూడా నిత్య సత్యాగ్రహిగా బ్రతికిన కర్మణ్యులు. గాంధీగారి ప్రభావంతో ఉద్యమంలో ప్రవేశించిన ఎందరో పెద్దలు నాయకులై రాజకీయ జీవితంతో పాటు తరువాత అధికార పథంలో పురోగమించిన వారున్నారు. వీరు మాత్రం జీవితాంతం గాంధీగారి నిర్మాణ కార్యక్రమానికే అంటిపెట్టుకొని పురోగమించిన ధన్యజీవి. అధ్యయనం, అధ్యాపనం ప్రధానవృత్తిగా జీవించిన వీరి కృషి గాంధేయ మార్గం లోనే కొనసాగటం, ఖాది గ్రామోద్యోగ మద్య నిషేధాది కార్యక్రమాలలోనే క్రియాశీలక ప్రవృత్తిని పెంచుకోవటం వీరి జీవిత ప్రత్యేకత. చిట్టచివరిదాకా రాట్నం వదలకుండ నిత్యానుష్టానంగా నూలు తీస్తూ జీవితం గడిపిన వ్యక్తి ప్రకాశరాయుడుగారు మాత్రమే అనిపిస్తోంది.

— సంపాదకీయం
'గాంధీ క్షేత్రం'

## 'భావ తరంగాలు'

1942 జులై 1వ తేదీ నేను మద్రాసు కేంద్రంలో నిలయ రచయితగా, కళాకారుడిగా చేరాక, నా గీతావళి [లలిత సంగీతం] కార్యక్రమాలలో ఒకసారి - 'స్వామి నీ ఆలయమున సంధ్యా దీపకళిక నోయి' అనే గేయం పాడుతూ దానినిండా మధ్య ప్రాచ్య సంగీత ధోరణులు వినిపించాను. కృష్ణశాస్త్రిగారు అది విని, హాఫీజ్ పర్షియన్ కవితలకు ఆంగ్లానువాదాలు చదివి తాను 'ఉమర్ ఖైయాం' జీవితంపైని తయారుచేసిన 'అతిథిశాల' నాటకాన్ని నాచేత సంగీతం పెట్టించి ప్రసారం చేయించారు. అది 1944-45. 'అతిథిశాల'లో నేను పాడిన మధ్య ప్రాచ్య సంగీత ధోరణులకు ఆకర్షితులై వాహినీ దర్శకులు శ్రీ బి. ఎన్. రెడ్డి మద్రాసు కేంద్ర అధికారులయిన గోపాలన్, మూర్తిగారలకు ఆ సంగీతం లోని ఆకర్షణ గురించి ప్రశంసించి అప్పుడు తాను తీస్తున్న 'స్వర్గసీమ' చిత్రంలోకి తాను ఒక యువ కవి చేత కొత్త రకం పాటలను నూత్న సంగీత రీతులలో వినిపించాలనే తన ఆశయాన్ని ప్రకటించారు. రీటా హేవర్త్ నటించిన 'బ్లడ్ అండ్ శాండ్' అనే చిత్రాన్ని నాకు చూపించి, అందు లోని మధ్య ప్రాచ్య సంగీత ధోరణిని స్ఫురింపజేసే 'పల్లవి'తో ఒక పాట తయారుచేయమన్నారు. అదే - 'ఓహెూ పావురమా' భామనుతి పాడింది.

—రజని
'ఆంధ్రప్రభ'లో

✱

## మానవ ప్రగతి

### రిమోట్ సెన్సింగ్

మన శాస్త్ర పరిజ్ఞాన పరిశోధన యాత్రలో మరో మైలు రాయిగా దేశీయంగా రూపొందించబడిన మొట్ట మొదటి రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహం 1988 మార్చి 17న ఒక సోవియట్ కాస్మోడ్రోమ్ నుండి ప్రయోగించ బడింది. రోహిణి, భాస్కర ఉపగ్రహా లను విజయవంతంగా ప్రయోగించిన తరువాత, ఇన్సాట్ శ్రేణి ఉప గ్రహాలుతో అంతరిక్ష పరిజ్ఞాన పరి శోధన మరింత ముందుకు సాగింది. ఇన్సాట్ - 1 బి మన కమ్యూనికేషన్ వ్యవస్థలలో విప్లవాత్మక మార్పులను తీసుకువచ్చింది. టెలివిజన్, రేడియో, టెలిఫోన్లు, టెలిప్రింటర్లు ద్వారా జాతీయ అంతర్జాతీయ మైక్రోవేవ్ టెలి కమ్యూనికేషన్ సంబంధాలకు ఈ ఉపగ్రహం వీలు కల్పించింది. ఇప్పుడు 'ఐ.ఆర్.ఎస్. - 1 ఎ' మన మొదటి రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహం. మన జాతీయ వనరులను మరింత స్పష్టంగా అవగాహన చేసుకోవడానికి కక్ష్యలోకి ప్రవేశిస్తున్నది. పరిమిత వినియోగదారులకు ప్రత్యేక సర్వీసుల కోసం ఇండియన్ రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహమనబడే ఈ ప్రయోగం నిర్దేశించబడినది. భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో) కు ఇది ఒక ప్రతిష్టాకరమైన సవాల్. వ్యవసాయం, అడవులు, భూ వినియోగం, భూగర్భ శాస్త్రం, నీటి వనరులు భౌగోళిక రచన వీటికి ఈ 960 కేజీల బరువు గల ఉపగ్రహం సహకరిస్తుంది. 103 నిమిషాల కొకసారి ఇది పరిభ్రమిస్తుంది. భూమిపైన ఒకే ప్రదేశానికి 22 రోజుల కొకసారి వస్తుంది. భారత కాలమానం ప్రకారం ప్రతిరోజు ఉదయం 10 గంటలకు భూమధ్య రేఖను దాటు తుంది. మొత్తం పేలోడ్ వ్యవస్థకు సెన్సార్ గుండెకాయ వంటిది. దానిని విదేశాల నుండి దిగుమతి చేసుకోవడం జరిగింది. దాని నేత్రం చూడగలిగే ప్రదేశాలను సెన్సార్ విశ్లేషిస్తుంది. పుష్‌రూమ్ సెన్సార్ అని పేర్కొన బడే ఈ సెన్సార్‌పై ప్రప్రథమంగా మన దేశంలో ప్రయోగాలు నిర్వ హింపబడుతాయి. స్పాట్ అనబడే తమ రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహంలో 'ఫ్రాన్స్ ఈ పరిజ్ఞానాన్ని పరీక్షిస్తున్నది. ఐ. ఆర్ ఎస్ - 1 ఎ' లోని మూడు

కెమెరాలు రేఖా చిత్ర రచనకు డిజైన్ చేయబడ్డాయి. ఈ పద్ధతి వలన అతి సూక్ష్మ వివరాలతో చిత్రాలను ఉపగ్రహం రికార్డ్ చేస్తుంది. ఉపగ్రహ సమాచారాన్ని ఫిలిమ్స్, మైక్రోఫిలిమ్స్, కంప్యూటర్ టేపులు, రంగుల నలుపు తెలుపు ఫొటోల రూపంలో రికార్డ్ చేయడం జరుగుతుంది. ఉపగ్రహ కార్యనిర్వహణ నియంత్రణ కేంద్రం బెంగుళూరులో ఉంది. హైదరాబాదు షాద్‌నగర్‌లో సమాచార సేకరణ సదుపాయాలు వున్నాయి. ఈ కేంద్రం ఉపగ్రహంలోని మూడు కెమెరాలలోని దేనినుండైనా చిత్రాలను స్వీకరించగలదు. రిమోట్ సెన్సింగ్ ఫొటో అర్థ వివరణ స్థాయి నుండి సమాచార డిజిటల్ ప్రోసెసింగ్‌కు బాగా అభివృద్ది చెందింది. దీర్ఘకాలం మన్నడానికి ఉపగ్రహం ప్రత్యేకంగా డిజైన్ చేయబడింది. ప్రయోగ దశలోను మరియు అంతరిక్షంలో ఉపగ్రహంలోని క్లిష్ట వ్యవస్థలు అతి తీవ్ర వత్తిడులకు తట్టుకోగలవో లేవో పరిశీలించడానికి ఉపగ్రహాన్ని అనేక పరీక్షలకు గురి చేయడం జరిగింది. రెండు ముఖ్య కారణాల వలన ఉపగ్రహాలను అనువుగా నిర్ధారించారు. మొదటిది ఎక్కువ ఎత్తునుండి పరిశీలించడం వలన ప్రయోజనాలు అధికం. రెండవది విమానాల వలెకాక భూమి ఉపరితలాన్ని స్థూలంగా ఎన్నిసార్లయిన పరిశీలించడానికి అవకాశముంటుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహాన్ని ప్రయోగించిన మొదటి దేశం మనది.

## కళాఖండాలు

విశ్వవిఖ్యాతి గాంచిన స్మిత్సోనియన్ సంస్థ వద్ద వచ్చే సెప్టెంబరు 28న కళాభిమానులకు కన్నుల పండుగలా అర్థర్ ఎం శాక్లర్ గ్యాలరీ ప్రారంభం కానున్నది. ఈసందర్భంగా నాలుగు ప్రధానమైన ఎగ్జిబిషన్లు, మరో మూడు చిన్న చిన్న ప్రదర్శనలు ఏర్పాటవుతాయి. వీటిలో ఆసియా, 'నియర్ ఈస్ట్' కి చెందిన వెయ్యి అపురూప కళాఖండాలను ప్రదర్శిస్తారు. న్యూయార్క్‌కు చెందిన వైద్య పరిశోధకుడు, ప్రచురణకర్త, కళాభిమాని అర్థర్ శాక్లర్ ఈ కళాఖండాలను విరాళంగా అందజేశారు. శాక్లర్ బహూకరించిన కళాఖండాల ప్రదర్శన అనంతరం ఈ మ్యూజియంలో అమెరికాలోని ప్రభుత్వ, ప్రయివేట్ 'కలెక్షన్'ల నుంచి సేకరించిన వివిధ చిత్రకళాఖండాలతో ఎగ్జిబిషను నిర్వహిస్తారు. శాక్లర్ గ్యాలరీకై 1986లో సేకరించిన వాటిలో ప్రధానమైన పెయింటింగులు, వ్రాతప్రతుల వైశిష్ట్యాన్ని చాటి చెప్పేందుకు 11 - 17 శతాబ్దాల మధ్యకాలం నాటి అద్భుతమైన 15 పర్షియన్, భారతీయ పెయింటింగులను ప్రదర్శనకు ఎంపిక చేశారు. ఈ మ్యూజియం వద్ద గల 500 పెర్షియన్, ఇండియన్ పెయిం

టింగులను, దస్తూరీ ప్రదర్శనాంశా లను, వ్రాతప్రతులను ఈ సందర్భంగా ఎగ్జిబిషన్‌లో వుంచుతారు. ఇలా వుండగా ఎగ్జిబిషన్‌లోని దక్షిణాసియా, ఆగ్నేయాసియా ఆలయ శిల్పాలు అనే ప్రదర్శనా విభాగంలో 3-14 శతాబ్దాల మధ్య కాలంనాటి రాతి, కాంస్య విగ్రహాలను ప్రదర్శిస్తారు. ఈ శిల్పాలు ఇండియా, పాకిస్థాన్, కంబోడియాలోని మత విశేషాలను గురించి తెలియజేస్తాయి. ప్రముఖ ఛాయా చిత్రకారుడు రఘుబీర్ తీసిన ఫోటోలను కూడా ఇందులో ప్రదర్శిస్తారు. 'గంగానది' అనే పేరుతో ఏర్పాటయ్యే ఈ ఛాయాచిత్ర ప్రదర్శనలో హిమాలయాల నుంచి బంగాళాఖాతం వరకు - పావన గంగా పరీవాహక ప్రాంతంలోని జీవన విధానాన్ని, ప్రకృతి రామణీయకతను, ఆచార సంప్రదాయాలను ప్రతిబింబించే 70 వర్ణచిత్రాలు కనువిందు చేస్తాయి. ఈ ఛాయా చిత్రాలు గంగానది ప్రాముఖ్యాన్ని, భారత జన జీవన స్రవంతిలో దానికి గల సమున్నత స్థానాన్ని కూడా విశదం చేస్తాయి.

## 'కొకేన్'

హనికరమైన 'కొకేన్' మాదక ద్రవ్యాన్ని దగ్గర వుంచుకున్న నేరానికి బ్రిటిష్ జెయిలులో ఆరు నెలల శిక్ష అనుభవించి వచ్చిన ప్రముఖ అమెరికన్ టెలివిజన్ నటుడు 'కీష్' తాను ఈ మత్తు పదార్థాన్ని మొట్టమొదటిసారిగా ఒక మిత్ర సమావేశంలో రుచి చూసినట్టు చెప్పారు. అప్పుడు ఆయన సరదాగా ఆపని చేశారు తప్ప అంతకు మించి దానికి ప్రాధాన్యం ఇవ్వలేదు. ఆ తర్వాత ఒక ఏడాదికి మళ్లీ ఇంకొకసారి 'కీష్' ఈ 'మందు' పుచ్చుకున్నారు. అప్పటికీ ఆయన సరదాగానే ఆ పని చేస్తున్నట్టు భావించారు. కాని ఆయనకు తెలియకుండానే ఆ మత్తు మందు ఆయనను తన గుప్పిట్లో ఇరికించుకుంది. మూడవ పర్యాయం 'కీష్' వుండబట్టలేక తనకు తానుగా ఒక గ్రాము 'కొకేన్'ను రహస్యంగా కొని సేవించాడు. అనంతరం కొద్ది నెలలలోనే 'కొకేన్' అతని జీవితంలో భాగమైపోయింది. "నా పతనానికి నేనే నాంది పలుకుతున్నానని అప్పట్లో నేను గమనించలేకపోయాను. అదే కొకేన్‌కి గల వినాశకర ప్రత్యేకత. ఈ మత్తు పదార్థం తన వినియోగదారుడిని - అతడికి తెలియకుండానే తన అదుపులోకి తెచ్చుకుంటుంది" అని 'కీష్' అమెరికన్ కాంగ్రెస్ కమిటీ సభ్యులకు వివరించారు. 1984 ఏప్రిల్ 3న 'కీష్' లండన్‌లోని హీత్రో విమానాశ్రయంలో అరెస్టయ్యారు. ఈ సంఘటన కీష్ జీవితాన్ని ఎంతగానో దెబ్బతీసింది. అయినప్పటికీ ఆయన ధైర్యంగా తట్టుకుని నిలబడ్డారు. 'కొకేన్' పెనుభూతం బారి నుంచితాను బయట పడడమేకాక, మరెవ్వరూ దాని అధీనంలోకి వెళ్లవద్దని కూడా ఆయన ఇప్పుడు హితవు చెబుతున్నారు. సుమారు రెండు కోట్లనుంచి

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్ఘీస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవ చైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుటూర్‌మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

4 కోట్ల 50 లక్షలమంది వరకు అమెరికనులు 'కొకేన్' ను ఎప్పుడో ఒకసారి రుచి చూసినట్లు సర్వేలలో వెల్లడైనదని, ప్రతి రోజూ సుమారు 5,000 మంది కొత్తగా ఈ మాదక ద్రవ్యానికి అలవాటు పడుతున్నారని పేర్కొంటూ 'కీష్' ఈ పరిస్థితి పట్ల తీవ్ర విచారం వ్యక్తం చేశారు. తొలి విడతగా బోధన ద్వారా ఈ మాదక ద్రవ్యం జోలికి ఎవరూ వెళ్లకుండా నిరోధించాలని, రెండవ ప్రయత్నంగా దీనికి అలవాటుపడిన వారిని గుర్తించి వారి పునరావాసానికి చర్యలు తీసుకోవాలని కోరుతూ 'కీష్' రెండంచెల కార్యక్రమాన్ని సూచించారు. మాదక ద్రవ్యాలకు బానిసలుగా మారిపోయి, ఆ 'విష' వలయం నుంచి బయట పడలేని వారు ఒక 'టైమ్‌బాంబ్' మీద కూర్చున్నవారితో సమానమని డాక్టర్ ఫారెస్ట్ టెనంట్ హెచ్చరించారు. కాలిఫోర్నియా రాష్ట్రంలో తమ ఆధ్వర్యంలో నడుస్తున్న లాభాపేక్షలేని 23 సామాజిక ఆరోగ్య పథకం ఆస్పత్రులలో 2,000 మంది 'మత్తుమందు బానిసలు' చికిత్స పొందుతున్నట్లు ఆయన తెలిపారు. మెదడు కణాలలోని సహజ రసాయనిక పదార్థాలను 'కొకేన్' మాదక ద్రవ్యం ఒక పద్ధతి ప్రకారం బయటకు నెట్టివేస్తుందని, దీనివల్ల మరణం సంభవించ వచ్చునని డాక్టర్ టెనంట్ చెప్పారు. మెదడు కణాలలోని మరి కొన్ని కీలక సహజ రసాయనాలను ఆల్కహాల్, మారిజోనా లాంటి మత్తు పదార్థాలు కూడా వెలుపలికి నెట్టివేస్తాయని ఆధునిక పరిశోధనలలో వెల్లడైనట్లు ఆయన వివరించారు. 'నికొటిన్' పైన కూడా పరిశోధనలు ముమ్మరంగా జరుగుతున్నట్లు డాక్టర్ టెనంట్ చెప్పారు. 'నికొటిన్' రక్తంలో 20 నుంచి 40 నిమిషాలు మాత్రమే వుంటుందని, అయితే అది 'కొటినిన్' మిశ్రమంగా మారిన పిమ్మట రక్త ప్రవాహంలో 18 గంటలపాటు వుండగలుగుతుందని ఆయన అన్నారు. అందువల్ల ధూమపానానికి అలవాటు పడిన వారిని 'నికొటిన్ బానిసలు' గా కాక' 'కొటినిన్ బానిసలు'గా పేర్కొన వచ్చునని టెనంట్ అభిప్రాయం వ్యక్తం చేశారు. మాదక ద్రవ్యాలఅక్రమ వినియోగానికి చెందిన వార్త లేకుండా ఏనాడు పత్రికలు వెలువడడం లేదని, ఈ సమస్య విషయంలో చేయవలసిన కృషి ఇంకా ఎంతో మిగిలి వున్నదని అమెరికా న్యాయ విభాగం అసోసియేట్ డిప్యూటీ అటర్నీ జనరల్ కారీమా థ్యూస్ వ్యాఖ్యానించారు.

## 'రాకేష్'

ఢిల్లీలో అక్టోబరు 11, 1956న జన్మించిన రాకేష్, తనకు ఒకటిన్నర సం॥ వయస్సు ఉండగా ఒకసారి తీవ్రంగా జ్వరం వచ్చిన ఫలితంగా చెవిటివాడయ్యాడు. ఆ తర్వాత ఎన్ని నివారణోపాయాలు ఉపయోగించినా, ఎన్ని ట్రీట్‌మెంట్లు వుపయోగించినా ఫలితం లేకపోయింది. బాల్యమంతా చెవిటిగానూ, తత్ఫలితంగా తక్కువ

మాటలతోనూ గడిచినా, చదువుపై అతనికి గల ఆసక్తిని గమనించి అతని తల్లితండ్రులు న్యూఢిల్లీలోని చెవిటి, మూగవారి ప్రత్యేక పాఠశాల లేడీ నోఈస్ స్కూల్ ఆఫ్ డఫ్ అండ్ డంబ్ లో చేర్పించారు. మొత్తానికి ఎన్నో కష్టాలు పడి 1978లో మెట్రిక్యులేషన్ పూర్తి చేయగలిగాడు. పాఠశాలలో విద్యాభ్యాసంతో పాటూ అతనిలో దాగి ఉన్న కళా తృష్ణ కూడా క్రమంగా వికసించసాగింది. తన ప్రతిభను, లోపాల్ని సరిచూసు కుంటూ తగిన విధంగా ఢిల్లీ కాలేజీ ఆఫ్ ఆర్ట్స్‌లో కమర్షియల్ ఆర్ట్ డిగ్రీ కోర్సులో ప్రవేశానికై ధరఖాస్తు చేసుకున్నాడు. అతని పోరాట ఫలితంగా ఢిల్లీ యూనివర్సిటీలోని ఈ కోర్సులో 3 సీట్లను మూగ, చెవిటి వారికి శాశ్వత ప్రాతిపదిక మీద కేటాయించడం జరిగింది. ఆ డిగ్రీ కోర్సులో చేరి 1984లో 67 శాతం మార్కులతో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణు డయ్యాడు. కేవలం కమర్షియల్ ఆర్టిస్టు గానే కాక, మంచి క్రీడాకారుడుగా కూడా అతను ప్రఖ్యాతిగాంచాడు. రాష్ట్రస్థాయి, అంతర్ రాష్ట్రీయ స్థాయి క్రీడలలో పాల్గొని ఎన్నో బహు మతులు గెల్చుకున్నాడు. ప్రస్తుతం అతను హర్యానా గుర్‌గావ్ లోని మారుతీ ఉద్యోగ్‌లో కమర్షియల్ ఆర్టిస్టుగా అక్టోబరు 11, 1984 నుండీ పని చేస్తున్నాడు. ☼



# కొత్త పుస్తకాలు

'రాణీ స్వయంవరం' - (రెండు నాటికలు); రచన: యస్. వి. రామారావు; ప్రచురణ: రత్నగర్భ బుక్స్, ఏలూరు - 534892; వెల: రు 4-00

సున్నితమైన హాస్యంతో సరదాగా వేసుకోడానికి అనువైన నాటిక 'రాణీ స్వయంవరం'. ఇందులో స్త్రీ పాత్ర లేకపోవడం నాటక సంఘాలవారికి సులువుగా వుంటుంది.

రెండో నాటిక 'ప్రొఫెసర్'. ఒక చిన్న అంతర్నాటకం, అపార్థాలు, చివరకు సుఖాంతం. ఇందులో ఒక స్త్రీ పాత్ర, మూడు పురుషపాత్రలు వున్నాయి. రెండూ శ్రద్ధగా వేసినపుడు రక్తి కట్టే నాటికలే.

* * *

'గెలుపు' (కథలు) - రచన: డి. సుజాతాదేవి; ప్రచురణ: స్పందన సాహితీ సమాఖ్య; వెల: రు. 12-00

ఉండలు కట్టి పారేసిన తల వెంట్రుకలను చవగ్గా కొని, పదిమంది చిన్నా పెద్దా ఆడవారి చేత ఆ జుట్టు వుండలు చిక్కు తీయించి, విడదీసి ఏకుల్లాగా చుట్టించి వారికి కిలో వుండలకి యింత అని కూలీ యిస్తాడు సోములు. ఈ జుట్టుతో సవరాలు కట్టించి అమ్ముతాడు. పాతబడి, దుర్వాసన వస్తున్న వెంట్రుకలు కుప్పలుగా పోసుకొని పనిచేసే స్త్రీల మధ్య నడుస్తుంది "ఎటు చూస్తే అటు" కథానిక.

పదిళ్ళకి పాల ప్యాకెట్లు సప్లయి చేస్తూ, వుదయం పూట చేపల మార్కెటులో కత్తి పీట ముందేసుకు కూర్చుని, చేపలు, రొయ్యలు కొనుక్కున్నవారికి అవి శుభ్రంగా తోమి, తరిగి పెట్టి, కిలోకి యింత అని సంపాదిస్తుంది తులసమ్మ. కూతురు చిట్టికి సొట్టకాలు. చిన్న చేపను పెద్దచేప మింగడం ప్రకృతి ధర్మం అని నమ్మే రామారావు, చిట్టిని మోసం చేస్తాడు. అది తెలిసి, రామారావు ఆచరించే నీతే తనకూ అనుకుని సాధ్యమైనంత త్వరగా చిట్టిని అమాయకుడైన కోటిగాడికి యిచ్చి కట్టబెడితే సరిపోతుందనుకుంటుంది తులసమ్మ.

విజయవాడలో బీసెంటు రోడ్డు మీద షాపులు వూడ్చి, వాకిళ్ళు కడిగీ, మంచి నీళ్ళు తెచ్చిపెట్టే పనికి గుత్తా తీసుకుంటుంది తన నోటి ధాటీతో పాపమ్మ. తన క్రింద నలుగురు ఆడ వాళ్ళని కుదుర్చుకొని వాళ్ళ చేత పనులు చేయించి వాళ్ళకి షాపుకి యిరవయ్యో పాతికో చొప్పున యిస్తుంది.

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!

# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి






త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో॥
మచిలీపట్నం-521 001.

పంక్తుల వ్యాసంగా రాసి, తమపేరు అచ్చులో చూసుకు మురిసిపోయే స్థితి కొచ్చింది. ఈ మినీకథకులకు, గత పాతికేళ్లలో 'జ్యోతి' ప్రచురించిన చక్కటి కథానికలు, ఒక విధంగా కను విప్పు కాగలవు. (ఈ రజతోత్సవ సంచికలో ఉన్నవన్నీ అవే).

పరమశివుడు గిరి కన్యను చేబట్టిన కళ్యాణ గాధ మీరభినయించగా సందర్శించవలెననేది తీరని కోరిక గానే మిగిలిపోయినది - అంటాడు శ్రీనాధుడు 'కనక - వీణె'లో. గులాబీ చెట్టు పీకి పారేసి, మిగిలిన ఒక పువ్వూ భర్త చేతికందించిన శివరావు భార్య, అసూయ - అహంకారం జోడుగుర్రాలు కాగా 'అగ్నిపుష్పం' ఎలా సమర్పిం చినదీ హృద్యంగా చెబుతారు కల్యాణ సుందరీ జగన్నాథ్. సిరి సంపదలలో తులతూగుతున్న కమల ఒక నాటి చెలి కాడైన సూరిబాబుని ఏ తీరున పలకరిం చినదీ, ఆ యిరువురి కంఠ స్వరాలలోని మార్పు, అనుబంధాలు ఏవిధంగా కాలావకాశ బద్ధమయేదీ వాస్తవికతా దర్పణం మన ముందు వుంచుతారు రాచకొండ విశ్వనాథశాస్త్రి. ఇలా ప్రతి ఒక్కరి రచన గురించి చెప్పాలని వుందిగాని స్థలా భావం వల్ల సాధ్యం కాదు. .... బాలగంగాధరతిలక్, మధు రాంతకం రాజరాం, శ్రీసుభా, భమిడి పాటి రామగోపాలం, అరిగే రామా రావు, త్రిపుర, వివేకానందమూర్తి, కాశీపట్నపు రామారావు, అచ్యుతవల్లి, ఏనాదేవి, భానుమతీ రామకృష్ణ, రంగనాయకమ్మ, రావికొండలరావు, అవసరాల రామకృష్ణరావు, ఆదివిష్ణు భమిడిపాటిజగన్నాధరావు,ముళ్లపూడి వెంకటరమణ,గొల్లపూడిమారుతీరావు, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, వైరాంబాబు అండ్ సాయి, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, చాగంటి సోమయాజులు, పాలగుమ్మి పద్మరాజు - మున్నగువారి కథానికలు, పట్టాభి, నారాయణరెడ్డి, వరవరరావు, శ్రీ శ్రీ, ఆరుద్ర, దాశరధి, ఆత్రేయ మున్నగు వారి కవితలు, గిలిగింతలు పెట్టే కార్టూనులూతో, బాపు ముఖచిత్రాలం కరణ గల ఈ రజతోత్సతవ సంచిక అసలు సిసలైన ప్రత్యేక సంచిక - ఉత్తమ కథానికల మంజూష.

— క్షీరసాగరమ్



శరీరశ్రమతో కూడినప్పుడే 'పని' అవుతుంది; లేకపోతే పని అనిపించు కోదు - వినోదం.

అభిప్రాయభేదాల్లాటివి గుర్రప్పం దాలు.

కాబేజీ, కాలేజీ చదువు నేర్చుకుంటే, కాలీఫ్లవర్ అవుతుంది.

గొప్ప గ్రంధమంటే ప్రతిఒక్కరూ చదవాలనుకుంటూనే చదవనిది.

సంపద నుంచి దారిద్ర్యం వేపుగా అతను అతివేగాన ఎదుగుతున్నాడు.

అనుభవం, ఆదర్శం, ఆశయబలం అవన్నీ అతనినంత చక్కటి అబద్ధాల కోరుని చేయగలుగుతున్నాయి.

—మార్క్‌ట్వేన్



పంక్తుల వ్యాసంగా రాసి, తమపేరు అచ్చులో చూసుకు మురిసిపోయే స్థితి కొచ్చింది. ఈ మినీకథకులకు, గత పాతికేళ్లలో 'జ్యోతి' ప్రచురించిన చక్కటి కథానికలు, ఒక విధంగా కను విప్పు కాగలవు. (ఈ రజతోత్సవ సంచికలో ఉన్నవన్నీ అవే).

పరమశివుడు గిరి కన్యను చేబట్టిన కళ్యాణ గాధ మీరభినయించగా సందర్శించవలెననేది తీరని కోరిక గానే మిగిలిపోయినది - అంటాడు శ్రీనాధుడు 'కనక - వీణె'లో. గులాబీ చెట్టు పీకి పారేసి, మిగిలిన ఒక పువ్వూ భర్త చేతికందించిన శివరావు భార్య, అసూయ - అహంకారం జోడుగుర్రాలు కాగా 'అగ్నిపుష్పం' ఎలా సమర్పిం చినదీ హృద్యంగా చెబుతారు కల్యాణ సుందరీ జగన్నాథ్. సిరి సంపదలలో తులతూగుతున్న కమల ఒక నాటి చెలి కాడైన సూరిబాబుని ఏ తీరున పలకరిం చినదీ, ఆ యిరువురి కంఠ స్వరాలలోని మార్పు, అనుబంధాలు ఏవిధంగా కాలావకాశ బద్ధమయేదీ వాస్తవికతా దర్పణం మన ముందు వుంచుతారు రాచకొండ విశ్వనాథశాస్త్రి. ఇలా ప్రతి ఒక్కరి రచన గురించి చెప్పాలని వుందిగాని స్థలా భావం వల్ల సాధ్యం కాదు. .... బాలగంగాధరతిలక్, మధు రాంతకం రాజరాం, శ్రీసుభా, భమిడి పాటి రామగోపాలం, అరిగే రామా రావు, త్రిపుర, వివేకానందమూర్తి, కాశీపట్నపు రామారావు, అచ్యుతవల్లి, బీనాదేవి, భానుమతీ రామకృష్ణ, రంగనాయకమ్మ, రావికొండలరావు, అవసరాల రామకృష్ణరావు, ఆదివిష్ణు భమిడిపాటి జగన్నాధరావు, ముళ్ళపూడి వెంకటరమణ, గొల్లపూడి మారుతీరావు, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, వైరాంబాబు అండ్ సాయి, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, వాగంటి సోమయాజులు, పాలగుమ్మి పద్మరాజు - మున్నగువారి కథానికలు, పట్టాభి, నారాయణరెడ్డి, వరవరరావు, శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరధి, ఆత్రేయ మున్నగు వారి కవితలు, గిలిగింతలు పెట్టే కార్టూనులూతో, బాపు ముఖచిత్రాలం కరణ గల ఈ రజతోత్సతవ సంచిక అసలు సిసలైన ప్రత్యేక సంచిక - ఉత్తమ కథానికల మంజూష.

— క్షీరసాగరమ్

---

శరీరశ్రమతో కూడినప్పుడే 'పని' అవుతుంది; లేకపోతే పని అనిపించు కోదు - వినోదం.

అభిప్రాయభేదాల్లాటివి గుర్రప్పం దాలు.

కాబేజీ, కాలేజీ చదువు నేర్చుకుంటే, కాలీఫ్లవర్ అవుతుంది.

గొప్ప గ్రంధమంటే ప్రతిఒక్కరూ చదవాలనుకుంటూనే చదవనిది.

సంపద నుంచి దారిద్ర్యం వేపుగా అతను అతివేగాన ఎదుగుతున్నాడు.

అనుభవం, అదర్శం, ఆశయబలం అవన్నీ అతనినంత చక్కటి అబద్ధాల కోరుని చేయగలుగుతున్నాయి.

—మార్క్ట్వేన్

---

సీరియల్

# 'ప్రతి గురువారం'

గడిచిన కథ: జేమ్సూ, రాబిన్సనూ 'ఆర్కయివ్' అనే చిన్న వార పత్రిక నిర్వహిస్తున్నారు. ఆపత్రికా నిర్వహణ లోని తమ సాధక బాధకాలూ కష్ట సుఖాలూ చెబుతున్నారు జేన్ మెక్లలిన్.

....ఇక చదవండి

కాగితపు చుట్ట తెగడం, ఈ తెగినది సవరించేందుకు అరగంట పట్టడం, యిలా నాలుగుసార్లు కాయితపు చుట్ట తెగడంతో, రెండు గంటల కాలం వృథా అయింది.

హితవు కానప్పటికీ, అప్పుడొక నిశ్చయానికి రాక తప్పింది కాదు. ఆ వారం పత్రిక విడుదలవాలని వుంటే, రెండు పేజీల పాత మిషనుని నమ్ముకోవడమే మార్గం.

మరుసటి వారం, ఆటోమాటిక్‌కి మరొక ట్రయిల్ యిద్దామనుకున్నాం. అంతా సక్రమంగా, నవ్యంగానే సాగింది. కాయితం ఎక్కడా తెగకుండా కాయితం చుట్టలో నుంచి చక్కగా వస్తోంది మిషనులోకి. అందరం మిషన్ చుట్టూ నుంచుని, దానికి వొంగి వొంగి సలాము చేశాం.

ఆ పైన, పత్రిక ఎలా ప్రింటవుతోందో చూదామని ప్రింటయిన కాపీ తిరగేశాం. ఘోరం, మహాఘోరంగా ఉంది. కొన్ని పేజీల మీద అక్షరాలే లేవు; మరికొన్ని పేజీల మీద సిరా ముద్దలు. పేజీల మార్జినులు మనని భయపెట్టేటట్టు వున్నాయి. కొన్నింటికి తలవైపు భాగం లేదు; కొన్ని అయిమూలలుగా వున్నాయి. ఒకటే మేలు. పేపరు మట్టుకు తెగడం లేదు; కాయితపు చుట్టలో నుంచి మిషనులోకి సక్రమంగా వస్తోంది. అచ్చు పరికరాల విషయంలో మాకు సలహా చెప్పే బెన్, పేపరు తెగకుండా వుండటం, ప్రస్తుతానికి ఘనవిజయంగా చెప్పుకోవచ్చునన్నాడు చిన్న చిన్న సర్దుబాటులతో మార్జినులు మన మాట వింటాయి - అని ధయిర్యం చెప్పాడతను.

మార్జినులు సరిగా దిద్దుకునేలోపున 900 కాపీలు అచ్చయిపోయాయి. చూస్తూ చూస్తూ వాటిని పారెయ్యడం యిష్టంలేక, అందులో కొన్ని పోస్టు చేసేశాం కూడాను - చందాదారులూ అడ్వర్టయిజర్లూ మా పట్ల ఆ మాత్రం కనికరం చూపకపోతారా? - అను ధయిర్యంతో.

ఆ వారానికావారం, మా ఆటోమాటిక్ ఒక దారిన పడ నారంభించింది వరసని ఆరువారాలు, కాయితం తెగకుండా వుండేట ప్పటికి, మాకెంతో సంతోషమేసింది. పూస్తే సిరా పూత పుయ్యడం, లేకపోతే అక్షరం

ముక్క కనిపించకుండా పోవడం - ఈ జబ్బు మట్టుకు ఏడాదిపాటు వుంది. మా చందాదారులూ, యడ్వర్టయిజర్లూ మట్టుకు మా ఆటోమాటిక్ అవకతవకల్ని ఓర్పుతో సహిస్తూ వచ్చారు.

ఆటోమాటిక్ పేరు రూబ్. ఈ రూబ్ మమ్మల్ని యించుమించు మింగేసింది. దాని ఖరీదు, దాన్ని అక్కడ నుంచి యిక్కడికి రాజ మర్యాదలతో తీసుకురావడం, అయిదడుగుల కాంక్రిట్ పిట్, కొత్తభాగాలు, కొత్త వైరింగ్ - మొత్తం ఎనిమిది వేల డాలర్లు తన పొట్ట నెట్టుకుంది. దీన్ని నడిపించేందుకుగాను మరొక ఆరు వేల డాలర్లు అప్పు చేశాం. 1871లో జోసెఫ్ పులిట్జర్ మొట్టమొదటి రోటరీ ప్రెస్ స్థాపించి, "దీని వెర్రి చేష్టలతో నాకు మతిపోతోంది'' అన్నాడు. అతను ఎంత బాధపడి, ఆ మాట అనివుంటాడో, మాకు తెలిసొచ్చింది.

## 20

గంటలూ జీతాలూ మనిషీ, చందాదారుల పోటీ, ఈ రూబ్ దేవతని కొని తెచ్చిపెట్టుకోవడం, డబ్బు బాధలూ వీటితో మాకు మనస్తిమితం లేకుండా పోయింది. వెనుకటి రోజుల్లో మేము యిబ్బందుల్లో వున్నామంటే, విధి మమ్మల్ని కరుణించి చల్లని చూపు చూసేది. ఇప్పుడు మేము ముందు వెనుకలు తెలియని అగాధంలో పడి పోయాం.

ప్రభుత్వ విచారణ అయిన మరుసటి వారంలో, బాబ్ తన సంపాదకీయంలో, ఈ అనుభవాల గురించి రాశాడు. చాలామంది మాపట్ల సానుభూతి కనబరిచారు. వ్యాపారస్తులు కొందరు మా ఆఫీసుకొచ్చి, వారివారి అనుభవాలు మాకు నివేదించారు. అది స్థానిక విషయమే కావచ్చు; కాని దేశమంతటికీ తెలియవలసినది కొంత వుంది అందులో.

"ఒక మాగజైన్ ఆర్టికల్ రాయకూడదా?'' అని అడిగాను బాబ్ని.

రాయడమంటే నొప్పులు పడతాడు, బాబ్; మూలుగుతాడు, గునుస్తాడు, అరుస్తాడు, ఎవరినో వుద్ధరిస్తున్నట్లు భావిస్తాడు. సిగరెట్టు ముట్టించి, కాయితం వంక దీనంగా చూస్తాడు. రాయడం తప్పించుకునేందుకు ఎన్ని మార్గాలు వున్నాయో అన్నీ వెతుకుతాడు.

చందాదారులపోటీ, ఆటోమాటిక్ కొనడం - వీటితో అతనికి మాగజైన్ ఆర్టికల్ రాసేపాటి స్తిమితం లేక పోయింది. 1950 జనవరిలో ఒకరోజు పొద్దుట, పక్కమీద నుంచి లేస్తూ, "ఇప్పటికి ప్రాణం కుదుటబడింది. అది రాత్రి పంపించేశాను'' అన్నాడు.

"ఎప్పుడు రాయగలిగావ్? అర్ధరాత్రిదాకా నేను ఆఫీసులోనే వున్నానాయె! అప్పటికి నువ్వింకా చేతుల నిండా గ్రీజుతో వున్నావ్!''

మొట్టమొదట చేతులు కడుక్కున్నాను. ఆ పైన టైప్‌రైటర్ దగ్గర కూచున్నాను. సిగిరెట్టు కూడా వెలిగించలేదు. గంటన్నర తర్వాత టైప్‌రైటర్ దగ్గిర నుంచి లేచాను. రాసినది కవరులో పెట్టి స్టాంపు అంటించి

వస్తూ వస్తూ పోస్టుడబ్బాలోఅది పడేసి యింటికొచ్చి స్నానంచేసి, పక్కమీద పడ్డాను.

"టైపు తప్పులుగానీ, స్పెల్లింగు తప్పులుగానీ వున్నాయేమో చూడను కూడా లేదా ?"

"ఆ బాధ కూడా ఎందుకు? సాటర్‌డే ఈవినింగ్ పోస్టునుంచి తిరిగి వచ్చాక చూసుకోవచ్చు."

రెండురోజుల తర్వాత మా రూబు (ఆటొమాటిక్)కి కొత్త జబ్బు పట్టుకుంది. ఆ జబ్బు కుదిర్చేందుకు బాబ్ పిట్‌లోకి వెళ్లాడు. ఇంతలో పోస్టుమాన్ ఉత్తరాలు తీసుకొచ్చి యిచ్చాడు.

"బాబ్, బాబ్ !" అని అరిచాను

"ఏమొచ్చింది?" అన్నాడు - రూబు కాళ్లదగ్గిరవున్న బాబ్.

"ఇదిగో, సాటర్‌డే ఈవినింగ్ పోస్టు దగ్గిర నుంచి ఉత్తరం."

"నువ్వే తెరు. దానిలో నుంచి తేళ్ళూ పాములూ రావుగా" అన్నాడు.

వణుకుతున్న చేతులతో కవరు చించాను. లోపలి ఉత్తరం చదువుతున్నప్పుడు, నా కళ్ళని నేను నమ్మలేక పోయాను. గంటలూ జీతాలూ మనిషి గురించి బాబ్ రాసిన ఆర్టికల్ వారు అచ్చు వేస్తున్నారు. చెక్కు మరుసటి పోస్టులో వస్తుంది.

"వాళ్లనీ ఆర్టికల్ వేస్తున్నారు" అన్నాను మహదానందంతో. ప్రెస్‌లో వున్న వాళ్ళందరికి వినిపించివుంటుందేమో కూడా - అంత బిగ్గరగా అన్నాను.

వంగి, ఏవో మరలు తిప్పుతున్న మనిషి నిటారుగా నిలబడి "ఏమిటే!" అన్నాడు. ఆ ఆర్టికలు అచ్చు అవుతోందంటే, అందరికీ ఎంత సంతోషమో చెప్పలేను. సాటర్‌డే ఈవినింగ్ పోస్టు ధర్మమా అని, ఆ వారం పనివారికి యివ్వవలసిన పైకానికి తడుము కోనక్కర్లేక పోయింది.

"నన్ను పట్టించిన కేంద్రోద్యోగులు" (The Federal Snoops Are After Me) అను శీర్షికతో 18-3-1950 సాటర్‌డే ఈవినింగు పోస్టులో ఆ ఆర్టికలు పడింది. అదే సంవత్సరపు అక్టోబరు రీడర్స్ డైజస్టులో పునర్ముద్రితమయింది. ప్రపంచంలోని నలుమూలలనుంచి, అర్కాయివ్ పత్రిక ఎడిటర్ పేర ఏడువందల ఉత్తరాలు వచ్చాయి. అమెరికాలోని ప్రతి రాష్ట్రంలోని కంట్రీ ఎడిటర్లు మాకు రాశారు. వార్తా పత్రికలూ మాగజైనులూ ఈ విషయమై సంపాదకీయాలు రాసి, వాద ప్రతివాదాలు సల్పాయి.

ఫిలడెల్ఫియాలో హాజరు కావలసిందని బాబ్‌కి ఉత్తరువు వచ్చింది. మాకు లోగడ రావలసిన 745 డాలర్లూ ఇపుడు రావలసిన 582 డాలర్లూ కంపెనీ అకవుంటులో నుంచి తీసుకోవలసిందిగా అధికారులు ఆర్డరు జారీ చేశారు. మేముతీసుకోమని భీష్మించుకు కూచున్నామా ? కంపెనీ అకవుంట్‌లో ఏనాడన్నా అంత మొత్తం వున్న మీదటగదా మేము తీసుకోవడమనేది ఏమయితే నేం, గంటలూ జీతాలూ

మనిషి ఒకవిధంగా మాకు ఉపకారమే చేశాడు. వందల సంఖ్యలో వచ్చిన ఆ ఉత్తరాలు మాకు నూతన శక్తినీ, ధయిర్యాన్నీ యిచ్చాయి. ఆర్కయివ్ పట్ల మాకు వున్న విశ్వాసం ద్విగుణీకృతమయింది.

## 21

ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రి అయిపోతుంది. బాబ్, నేనూ టైప్‌రైటర్ల ముందు కూచుని వుంటాం. చెల్లించవలసిన బిల్లులు, వెళ్ళవలసిన మీటింగులు, చూడవలసిన కాగితాలు మమ్మల్ని భయపెడతాయి.

మూడువందల డాలర్ల ప్రింటింగ్ బిల్లు యివ్వవలసిన మనిషి అయిపూ ఆనమాలూ లేకుండా పారిపోయాడు. జాన్‌హిక్స్‌కి విత్తనాల కేటలాగు ప్రింట్‌చేసి యిచ్చాం; కాని, వాళ్ల పెద్దబ్బాయి పోలియో(Polio) హాస్పిటలులో వుండగా, ప్రింటింగ్ బిల్లు ఎక్కడ చెల్లించగలడు? బాంక్ వారి దగ్గిర అప్పుతీసుకున్న పైకం తాలూకు వాయిదా మర్నాడు కట్టి తీరాలని పీటర్స్ జ్ఞాపకంచేసి వెళ్ళాడు సాయింత్రం. అబ్బాయికి చెప్పులజత కొని తీసుకొస్తానన్నాను; కాని, మధ్యాహ్నంవేళ ఆ సంగతే మర్చిపోయాను. వేలాడే దీపకాంతి కింద మేమిద్దరం, ఇలా వున్నాం. సుఖపడుతున్నామా?

అంటే సమాధానం లేదు. కాని, న్యూయార్క్ టైమ్స్ ఎడిటరుగా వుంటారా అన్నా, బెత్లెహెమ్ స్టీలు కంపెనీ ప్రెసిడెంట్‌గా వుంటారా అన్నా - "వొద్దు బాబు మాకు" అని నిస్సంకోచంగా అంటాం. "విజయం (Success) అనేది సామాన్య సుగుణాలని అభ్యసించడంవల్ల వస్తుంది - కష్టపడి, పని చెయ్యడం, తెలివి తేటలు, ఉత్సాహం, ఆత్మవిశ్వాసం, నిజాయితీ - ఈ అయిదూ వుండాలి," అన్నాడు యడోల్ఫ్ ఓష్. "కంటినిండా నిద్రపోవడం నేను ఎరగను," అంటాడు హెచ్. యల్. మెన్‌కన్. ఉదయం 10 గంటల నుంచి రాత్రి 2 గంటలదాకా పని చెయ్యడమే, జోసెఫ్ పులిట్జర్ లభించిన విజయానికి మూలకారణం.

మాకు సంతృప్తి లేకపోలేదు. ఫలానా సంపాదకీయం బావుందని ఎవరో పాఠకుడు రాసినప్పుడూ, ఆర్కయివ్ కృషివల్ల తమకి తిండీబట్టా లభించాయని దారిద్ర్యంలో వున్న ఏదో కుటుంబం రాసినప్పుడూ, తన భార్య గయ్యాళితనానికి మందు ఏమిటని అమాయక సంసారి మా దగ్గిర కొచ్చినప్పుడూ, "మా యింట్లో చేసుకున్నాం - మీరుకూడా రుచి చూడండి" అని పొరుగు మనిషి మాకోసం ఏదో ఆప్యాయతతో తెచ్చి పెట్టినప్పుడూ, తన తోటలోవని ఒకబుట్టెడు యాపిల్స్ తీసుకొచ్చి ఎవరో తోటమాలి మాకు పంచిపెట్టినప్పుడూ, పదేళ్ళకుర్రవాడు రోజుకి పదిసెంట్లచొప్పున పచ్చగడ్డి కోస్తూ అలా యిరవై అయిదుసార్లు కోశాక, వచ్చే రెండుడాలర్ల యాభై సెంట్లతో ఆర్కయివ్ పత్రిక ఒక యేడాదిపాటు తన రోగిష్టి తల్లికి సమర్పిద్దామనుకున్నప్పుడూ -



"Father, Rama is said to be an ideal person. They say his example is to be emulated. I do not understand why such a great man should humiliate Sita by asking her to prove her chastity after the completion of battle with Ravana."

"Raghu, he gave her the offer of choosing shelter under the roof of any one of these four: Lakshmana, Bharata, Sugreeva and Vibheeshana...."

"That I do not know. Scandalous. How could he be so mean?"

"It was not meanness, Raghu. He knew in his heart of hearts how great and ennobling Sita was. If only she wanted, she could have reduced Ravana to ashas in a split-second but the glory of annihilating Ravana should appropriately go to her husband Rama. When Ravana lighted the tail of Hanuman, it resulted in Lanka Dahan but not a scratch or burn to Hanuman How could it be? It was Sita that asked Agni, the god of fire, not to cause any harm to Hanuman and Agni implicitly obeyed her. Rama was aware of this and as such he provoked Sita with harsh words to enable her show to the world she was Agni Puneeta. Both Rama and Sita have divinity in them but Valmiki made them behave like mortals here and there to inculcate a spirit of human element."

---

*SWADHARMA SWAARAJYA SANGHA*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*
*(Ph : 514477)*

మాకళ్ళు చెమ్మగిలక మానతాయా? మేము చేస్తున్నపనిలో మాకు తృప్తి సంతోషం ఎందుకుండవ్?

బాబ్ కొన్ని వారాలపాటు రూబుని బుజ్జగించి, అంతా సరిదిద్ది, పిట్‌లో నుంచి బయటకొచ్చి 'స్విచ్ వేయండి' అంటాడు; స్విచ్ వేసేటప్పటికి కరెంటు ఉండదు - అందరికి ఫకాలున నవ్వువచ్చి నవ్వుతాం; ఆటోమాటిక్‌లోని ఫోల్డర్లకి సిరా తగిలి, అవి ప్రింటు అయి వస్తున్న పత్రికలన్నిటికి అలంకారాలు చేకూరుస్తూంటే, నవ్వుకోక చెయ్యగలిగేదేముంది? దద్దరిల్లే శబ్దంతో మహోద్ధృతంగా పరువులెత్తే మిషన్, పేపరుని టపటపమడిచి బయటికి పడేస్తున్నప్పుడు, "ఇదిగో యిది మీకు, ఇదిగో యిదిమీకు" అంటున్నట్టు ఉండదూ? - అపూర్వానుభవాలు విడమరచి చెప్పడం కూడా కష్టం. సువిశాలమైన మా అశ్వశాలకి బ్రహ్మాండమైన హృదయం వున్నట్టూ, ఆ హృదయం ధనధన కొట్టుకుంటున్నట్టూ అనిపించేది. అంచేతనే అర్ధరాత్రి అయినా, తిండీతిప్పలూ లేకపోయినా, విశ్రాంతి అనే మాటకి వర్ణక్రమం మర్చిపోయినా, మేము చేస్తున్న పనిలో మాకు ఏదో సంతృప్తి కనబడేది.

మరీ నిరుత్సాహం కలిగినప్పుడు ఫిషర్ యామిన్ మాటలు జ్ఞాపకం తెచ్చుకునేదాన్ని: "రాజరిక మనేది పెద్దపెద్ద తెరచాపలు గల చక్కటి ఓడ. దాని నడక మహా దర్జాగా ఉంటుంది. కాని, ఏదైనా రాతికిగాని కొట్టుకుందా, బుడుంగున మునిగి పూరుకుంటుంది. ప్రజాస్వామ్యం తెప్ప (Raft) వంటిది. అది ఎప్పటికీ మునగదు; కాని పాదాలెప్పుడూ నీళ్లలో ఉంటాయి."

చిన్న వార పత్రికని నడుపుతున్నప్పుడు మనకాళ్లెప్పుడూ నీళ్లలోనే ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఆ నీళ్లు వేడిగాకూడా వుంటాయి. ఏమయితేనేం, మేము యింతవరకూ మునిగిపోలేదు; యింకా తేలేవున్నాం. ❋

**(జేన్ మెక్లవిస్ మౌలిక రచనకు యన్నార్ చందూర్ పాతికేళ్ల క్రితం చేసిన అనువాదం-లోగడ ఒకసారి ఈ పుస్తకం తెలుగులో వెలువడ్డప్పుడు వ్రాసిన పరిచయ వాక్యాలు:**

బాలా ప్రేమలు వివాహంతో అంతమవుతాయి. కాని ఈ దంపతుల విషయంలో అలాకాలేదు. వీరి ప్రేమ వివాహానంతరం ప్రారంభ మవుతుంది. ఇద్దరూ కలిసి ఒకే లక్ష్యసాధనకి కృషి చేయడంలో వారి అనురాగలత సువాసనలు వెదజల్లుతుంది. పత్రిక అంటే పులిట్జర్ ప్రయిజ్ రావడ మనే అనుకుంటుంది జేన్ మొదట్లో; కాని కష్ట నిష్ఠూరాలని ఆనందాశ్రువులతో చిలకరించే అపూర్వానుభవమని తరవాత్తరవాతగాని తెలీదు. ఈ ప్రఖ్యాత కథని యూనివర్సల్ ఇంటర్ నేషనల్ పిక్చర్సు (హాలీవుడ్) వారు సెలిలాయిడ్‌లో సమర్పించారు లోరెట్టా యంగ్‌తో



1988 మే 01

వసంత వేణువుని హృదయా రామాన పలికించ గల దివ్యాను భూతి నిస్తుంది చెవుల మీద పడే సంగీతం — అన్నాడొక ఆంగ్లకవి. అప్పయ్య దీక్షితార్‌కి పదమూడవ తరం, సుప్రసిద్ధ జాతీయోద్యమ నాయకుడైన సత్యమూర్తి మనుమడు, ప్రతిష్టా కరమగు ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ (న్యూఢిల్లీ) నుంచి యమ్‌డి తీసుకు, ఇండియన్ ఎయిర్ లైన్స్ వారి మద్రాసు కార్యాలయంలో సీనియర్ మెడికల్ ఆఫీసరైన డాక్టర్ వి యన్ భరద్వాజ్‌కి, చిన్నప్పట్నుంచీ సంగీత మంటే ఎంతో అభిలాష. సంప్రదాయ కర్ణాటక సంగీతం బాగా నేర్చుకున్నాక, హిందూస్థానీలోని గజల్స్, భజనలూతో బాటు రవీంద్ర సంగీత్ కూడా సాధన చేశారు. పదమూడో ఏట నుంచీ కచేరీలు చేస్తున్న ఈ డాక్టరుగారు ఢిల్లీలో, పద్దెనిమిదేళ్ల పాటు ఆలతూర్ సోదరుల శిష్యుడైన శంకరశర్మ వద్ద కర్ణాటక సంగీతమూ, ఎనిమిదేళ్లపాటు హేమంత కుమార్ శిష్యుడైన సమీర్ నర్కార్ వద్ద హిందూస్థానీ మ్యూజిక్, రవీంద్ర సంగీత్ అభ్యసించారు .... 'కెన్నమెరా' లో యివ్వాళ డాక్టర్ భరద్వాజ్ పాడిన రెండు కాసెట్స్‌కి ప్రారంభోత్సవం జరిగింది. అరవైనిముషాల 'అఫ్‌కా సాత్' గజల్స్ హిందీలోను, నలభై అయిదు నిముషాల 'అంబిగా ఇసై మాలై' (అంబికా స్తుతి) తమిళంలోను. 'సంగీతా' వారు ఈ రెండు కాసెట్లు విడుదల చేశారు. హిందీ కాసెట్‌కి మ్యూజిక్ ఖాజా బహుద్దీన్. సమకూర్చగా, తమిళానికి ఎమ్ రంగారావు .... రిలీజ్ ఫంక్షన్‌కి అధ్యక్షత వహించిన పార్లమెంటు సభ్యురాలు వైజయంతీమాలా బాలీ ఈ డాక్టరుగారిలో సంగీతం పట్ల భక్తి ప్రేమలతోబాటు ఆపేక్ష, ఆసక్తి వున్నాయన్నారు. భారతీయ సమైక్యతా సాధనలో సంగీతం ఒక ఉపకరణ — అన్నారు హిందీ కాసెట్ విడుదల చేసిన యల్వి ప్రసాద్. సంగీతజ్ఞులని నిరంతరం ఆహ్వానిస్తూ వుంటుంది మా సినిమా రంగం - అన్నారు ఛాంబర్ అధ్యక్షులు వెంకటేశ్వరన్ - తమిళ కాసెట్ రిలీజ్ చేస్తూ.... గజల్‌లో ఉండేది 'స్వీట్‌నతింగ్' అయినప్పటికీ, ఆ పద సౌరభం మనని పరవశింజేస్తుం

దని సీనియర్ అడ్వకేట్ హబిబుల్లా బాద్‌షా, గజల్స్‌లో హిప్నటిక్ లక్షణం ఉన్నదని ఆర్కాట్ జూనియర్ ప్రిన్స్ మహమ్మద్ అబ్దుల్ అలీ, సంగీత ధారలో మానవహృదయాన్ని ఉన్నత పథాలకు లేవనెత్తగల లక్షణం ఉన్న దని డైరక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ శ్రీపాల్, భరద్వాజ్ లోని సంగీతాభిరుచి తనని చకితుని గావించిందని బాల మురళీకృష్ణ, తను సంగీతనాటక అకాడమీ ఛైయిర్‌మాన్ అయినప్పటికీ, దూరదర్శిని డైరక్టరుగా రిటైరయి నప్పటికీ, తనని సుబ్బుడు (ప్రఖ్యాత మ్యూజిక్ క్రిటిక్) సోదరునిగానే గుర్తిస్తున్నారనీ, మనవాళ్లు హిందూ స్థానీ మ్యూజిక్ నేర్చుకోవడమే తప్ప, ఉత్తరాదివారు మన సంగీత రీతుల పట్ల శ్రద్ధ చూపకపోవడం హర్షణీయం కాదని పివి కృష్ణమూర్తి, నేర్పరియైన నరుడు తన 'వోకల్ కార్డ్స్'ని ఎంతో కౌశలంతో భావవ్యక్తీకరణ చేయగల శబ్దాలు పలికేందుకు వినియోగించాడనీ, ఆ శబ్దోచ్చారణ క్రమేణా అవసరాన్ని బట్టి శ్రుతిబద్ధమయిందనీ, ఆ శ్రుతులే సంగీత మయాయనీ లక్ష్మణస్వామి మొదలియార్ పి జి ఇన్‌స్టిట్యూట్ డైరక్టరైన డాక్టర్ కామేశ్వరన్ చెప్పారు .... ప్రఖ్యాత సోదరుని (కమల్‌హాసన్) సోదరునిగాను, ప్రఖ్యాత కుమార్తె (సుహాసిని) తండ్రిగాను మాత్రమే నన్ను గుర్తిస్తారు; అయితే ఫాల్కే అవార్డ్ పొందిన ఒక మహానుభావుని చేత (యల్వి ప్రసాద్) నేను నిర్మించిన చిత్రంలో నటింపజేసిన ఘనత నాది-' అంటూ మృదుమధుర హాస్యంతో సభా కార్యక్రమం నిర్వహించారు చారు హాసన్. ఇందరు ప్రముఖులు తనపై కురిపించిన ప్రశంసలకు కడు వినయంతో సమాధానం చెప్పారు డాక్టర్ భరద్వాజ్. జాతీయ సమైక్యతా కృషిలో సంగీతానికి గల స్థానం ఎవరూ కాదనలేనిది. 'ఇంటర్ ఫెయిత్' కార్యదర్శి హరిభజన్ సింగ్ ఈ కార్య భారం తనమీద వేసుకొన్నారు. డాక్టర్ భరద్వాజ్ విషయంలో మెడిసిన్ ఆయన వృత్తి; సంగీతం ప్రవృత్తి. సంగీతానికి ఈ విధంగా అంకితమైన డాక్టరనగానే ఆల్బర్ట్ ష్వైట్జర్ గుర్తుకి రాకమానదు. డాక్టర్ భరద్వాజ్ ఆ ఎత్తుకి ఎదగవచ్చు, ఎదగలేకపోవచ్చు. కాని, ఆ వరవడిలో నడుస్తారనీ, జాతీయ సమైక్యతకు యితోధికంగా పాటుపడు తున్నారనీ వొప్పుకోక తప్పదు.

.....05

ప్రఖ్యాత గాయనీమణి, మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖలో అధ్యా పకురాలు అయిన సౌభాగ్యవతి ప్రమీలకు (కుంజితపాదమ్ దంపతుల కుమార్తె) కృష్ణస్వామి అసోసియేట్స్‌కి చెందిన చిరంజీవి గురుమూర్తికీ (రాజమ్ దంపతుల కుమారుడు) ఈ ఉదయం పదిన్నరకి వుడ్‌లాండ్స్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. బంధుమిత్రులనేకులు నూతన

దంపతులకు శుభాభినందనలు తెలిపారు.

. . . . . 07

సంగీత నాట్యాల ద్వారా, లలిత కళల ద్వారా జాతీయ సమైక్యతకు యితోధికంగా కృషి చేస్తున్న మద్రాసు తెలుగు అకాడమీ, వియస్‌టి ఇండస్ట్రీస్ వారి సహకారంతో, యివ్వాళా రేపూ 'ది స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్' [The Spirit of Freedom Concerts] నిర్వహిస్తోంది. ప్రముఖ పారిశ్రామిక వేత్త పి. ఓబుల్ రెడ్డి ఛెయిర్‌మాన్‌గా, డాక్టర్ బాలమురళీ కృష్ణ అధ్యక్షులుగా, టివికె శాస్త్రి సారధ్యంలో 1981 నుంచి నిర్వహింపబడుతున్న మద్రాసు తెలుగు అకాడమీ గురించి తెలియని వారెవరూ లేరు – ఈ మహానగరంలోను, యావదాంధ్రలోను! సభ్యత్వ చందాగాని, విరాళంగాని, టికెట్‌గాని లేకుండా, కేవలం లిఖిత అభ్యర్థనకు ప్రవేశ పత్రం (యిద్దరికి) అందజేసే సాంస్కృతిక సంస్థ, ఈ మద్రాసు తెలుగు అకాడమీ! అలాటిదే తోబుట్టువైన భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ కూడా. ఇంతటి అసాధ్యమైన కార్యాన్ని - నేషనల్ సిటిజన్‌గా గుర్తింపు పొందిన శాస్త్రి గారు ఎలా చేయగలుగుతున్నారూ అంటే, వి యస్ టి ఇండస్ట్రీస్ వంటి మహాసంస్థలు చేయూత నివ్వడం వల్ల! సంగీత సమ్మేళనలు, జుగల్‌బందీలు, దృశ్య కావ్య ప్రదర్శనలు, నృత్య ప్రదర్శనలు వంటివి ప్రోత్సహించడం, పెర్ ఫార్మింగ్ ఆర్ట్స్ ద్వారా



శీతోష్ణ స్థితిగతులకు, వాతావరణ ప్రభావాలకు తట్టుకోలేక కాలగర్భంలో కలిసి పోయిన మెసోజయిక్ యుగం నాటి ప్రాణి శాకాహారి. అతిస్వల్పమైన మెదడూ, అతి దీర్ఘమైన దేహమూ (90 అడుగులు) గల డినాజర్, ద్విపాదీ, చతుష్పాదీ కూడా!

వివిధ ప్రాంతాలనీ సంస్కృతులనీ చేరువగా తెచ్చి, జాతీయ సమైక్యత కోసం తమకు అనువైన రీతిలో పాటుపడటం స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్ ఆ కోవలోనివే! సోనాల్ మాన్ సింగ్, సంయుక్తా పాణిగ్రాహి, చిత్రా విశ్వేశ్వరన్, రాబిన్‌టన్ కామా, మాధవీ ముదల్, మాళవికా సర్కార్, ఆశా కూరెవాలా, డేనియల్ మొలిని మున్నగు వారి నృత్య ప్రదర్శనలు వీరి స్పాన్సరింగ్‌లో జరిగాయి. రవిశంకర్ తన సోదరుడు ఉదయ శంకర్ స్మృతి గౌరవంగా యిచ్చిన సంగీత

కచ్చేరి, జరత్తుష్టాగురించిన ఒక ఫిలిమూ, యమ్మెస్ సుబ్బలక్ష్మి కాన్సర్ట్, భీమసేన్ జోషి, బాలమురళీ కృష్ణ, కిషోరి అమోన్కర్, పండిట్ జస్‌రాజ్, హరి ప్రసాద్ చౌరాసియా, ఉస్తాద్ అమ్‌జాద్ అలీ - ఆ స్థాయిలోని వారు స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్‌ని తమ గాన మాధురితో బహుజన రంజకంగా చేసి భాషావధుల కతీతమైన సంగీత ధారతో శ్రోతలను రసార్ణవంలో ముంచారు. విభిన్న గాన ప్రవంతులతో వివిధ ప్రాంతాల మధ్య వారధి నేర్పరచ గలిగిన సదవకాశం తమకు లభించిందన్నారు వియస్‌టి మేనేజింగ్ డైరక్టర్ భూత లింగం.... శుభ సూచకంగా పన్నెండు పావురాలు వొదిలారు - అందులో అయిదు తప్పించుకు పారి పోయాయి - మిగతావి బుద్ధిమంతుల్లా వేదికమీద కొచ్చాయి. పద్మభూషణ్ యమ్మెల్ వసంత కుమారి గాత్రం, పద్మభూషణ్ విజి జోగ్‌ల (వయొలిన్) జుగల్ బందీ ఈ రోజున! ఆనంద గోపాల్ బందోపాధ్యాయ తబలా, ఆర్ రమేష్ మృదంగం, నలుగురూ నిష్ణాతులే. ముత్తుస్వామి దీక్షితార్ 'వాతాపి గణపతిం' తో (హంసధ్వని - ఆదితాళం,) ప్రారంభించారు. వసంతకుమారి. ఆ తర్వాత రాగం తానం పల్లవి.... 'శ్రీరామ రాఘుకుల తిలక' పండిట్ జోగ్ వయొలిన్ మీద పలికిస్తున్నప్పుడు, సంగీతం భాషాతీతమైనదని మనకు స్వయంగా బోధపడుతుంది. మ్యూజిక్ అకాడమీ లో కూచున్న ఆ మూడు గంటలూ గాన రసాస్వాదనలోమట్టూ లోకాన్ని మర్చిపోయారందరూ!

. . . . . 08

సోనాల్ మాన్‌సింగ్‌ని చూడటం ఇది మూడోసారి అయినప్పటికీ, ఆమె యివాళ చేసిన 'ద్వివర్ణ' నృత్యం మరువలేనిది, మరుప్పరానిది. ఆమె విద్యా సరస్వతే కాదు (ఇంగ్లీషు, హిందీ, ఒరియా, బెంగాలీ, తెలుగు, తమిళంతోబాటు సంస్కృతం, జర్మన్ భాషలు బాగా వచ్చు), నాట్యమయూరి; మయూరి అనటం కూడా సామాన్యంగా ఉంటుంది - నాట్యకళాదేవత. ముఖ్య అతిథి జివి రామకృష్ణ (తమిళనాడు గవర్నరు సలహాదారు) చెప్పినట్లు, మన భారతీయ నాట్యకేతనాన్ని దేశదేశాలా ఎగురవేసి, మన సాంస్కృతిక ఖ్యాతిని యినుమడింపజేసిన అనుపమ కళాకోవిదురాలామె 'వదనం మధురం....' అంటూ ఆమె చేసిన జయదేవకృతి, మన హృదయాన్ని చెరుకు రసంతో నింపుతుంది. దశావతారాలకి ప్రతిగా 'లలితా సహస్ర నామం' లోని దశరూపాల్లోని ఆదిశక్తిని ఆమె ప్రదర్శిస్తున్నప్పుడు, ఆ సాహిత్య సంగీతాలు నృత్య వైభవంతో మనముందు ఒకమూర్తిగా సాక్షాత్కరిస్తున్నప్పుడు, మనకు కనిపించేది సోనాల్ మాన్‌సింగ్ కాదు - ఒక దివ్యశక్తి రూపకల్పన, సహస్ర నామార్చన పొందే మహాశక్తి, ఆమెలోనే లలిత, కాళి, భైరవి, అన్నపూర్ణ ఎందరో ఉన్నారు....

'ద్వివర్ణ' నృత్యంలో యిటు భరత నాట్యమూ, అటు ఒడెస్సీ ఆమె ఎంత అవలీలగా బొంగరంగా తిరుగుతూ చూపగలిగారో, తలుచుకుంటే ఆశ్చర్య మేస్తుంది. ఆమెలోని కళాతృష్ణ వయ సుని జయించింది. నాట్య విద్యలో లీనమైన కళా కౌముది సోనాల్ మాన్ సింగ్. ....ఉపన్యాసాలు, పూల దండలూ సత్కారాలూ అయాక యన్నెస్ గోపాల కృష్ణన్, పండిట్ జోగ్ వయొలిన్ జుగల్ బందీ. హిందూస్థానీ, దాక్షిణాత్య సంగీతాలు ఏకధారై ప్రవహించాయి....ఈ రెండు రోజుల సభా కార్యక్రమాన్ని జయా శేఖర్, సంగీత కార్యక్రమాన్ని మహతి 'కంపేర్' చేశారు. ఈ రెండు రోజుల పండగ అయిపోయింది; ఇక, శాస్త్రి గారి దృష్టి ఎంతకీ అగస్టులో జరుగ బోయే ఫంక్షన్ (విజయవాడ) మీద; .... ఇందాక ఢిల్లీ మిత్రులు జివిజి కృష్ణమూర్తిగారు అడిగారు: 'ఈయనకి ఈ ఎనర్జీ ఎక్కడ నుంచి వస్తుంది?' అని .... 'తన కోసంగాక ఒక లక్ష్యం కోసం కదా' - అని సన్నగా చెప్పాను చెవిలో .... ఒక లక్ష్యమూ, ఒక ధ్యేయమూ ఆర్గనై జర్‌గా శాస్త్రిగారి కెటువంటి మనో ధృతి నిస్తున్నదీ దగ్గిర్నుంచి చూస్తున్న వారికి మాత్రమే తెలుసు! ఆర్గనైజ్ చేయడంలో ఆయనకు సాటి మరొకరు లేరని ఎందరో వొప్పుకుంటున్నారు. తన ద్వారా యిలాంటి మంచిపనులు జరగడం తన సుకృతమని మనసా నమ్మే జాతీయవాది ఆయన.



వివాహానికి యుక్త వయస్సు నిర్ణయిం చేది దేశకాల పరిస్థితులూ, సాంఘికా చారాలూను. అమ్మాయికి 24, అబ్బా యికి 27 వస్తేగాని అలాస్కా, పెనామా వంటి దేశాలతో పెళ్లికి ఆమోదించరు.

. . . . . 10

"రంగు రంగుల పోగులతో ఎంతో అందంగా అల్లిన జలతారు చిత్ర యవ నిక ఆమె జీవితం....అంతర్ముఖంగా బహిర్గతంగా యోగిపుంగవులు అచ్చెరు వొందే చైతన్యమూర్తి ఆమె. గురుదేవ్ టాగూర్ వలె మన సంస్కృతీ పున రుజ్జీవనానికి త్రికరణశుద్ధిగా అంకితమైన కళా తపస్విని. మద్రాసులోను, మెల్బోర్న్‌లోనూ ఒకే తీరున వ్యవ హరించగల ధీరహృదయిని ఆమె. సంస్కృత భాషా పండితులైన తండ్రి గారు నీలకంఠశాస్త్రి వద్ద నుంచి, దివ్యజ్ఞాన సమాజం వారి సర్వమానవ సౌభ్రాతృత్వం నుంచి, అనీబిసెంట్

శిష్యరికం నుంచి, డా॥ అరండేల్ సాహచర్యం నుంచి ప్రభావితురాలైన రుక్మిణీదేవి తన 21వ ఏట యంగ్ థియాసఫిస్ట్స్ ఫెడరేషన్‌కి (స్వదేశ లోను, ప్రపంచ వ్యాప్తంగాను) ప్రెసిడెంట్ అయ్యారు....తప్పొప్పుల విషయంలో ఆమె దెప్పుడూ మనో నిబ్బరంతో కూడిన నిశ్చితాభిప్రాయం. 'సంభవామి యుగే యుగే' అని గీతాచార్యులు చెప్పినట్లు, ధర్మపరిరక్షక కళలని లేవనెత్తేందుకు సరస్వతీదేవి కూడా అవతారమెత్తుతూ వుంటుందనేందుకు నిదర్శనమే రుక్మిణీదేవి. 32వ ఏట 'కళాక్షేత్ర' స్థాపించిన ఈమెలో అన్నాపావ్‌లోవా, మీనాక్షి సుందరం పిళ్లె ఒకటయ్యారు; అలాగే ఆమె అవలంబించిన విద్యాబోధనా పద్ధతులలో మాడమ్ మాంటెస్సోరి, మహాత్మాగాంధీ ఒకటయారు. కణ్వ మహర్షి తపోవనంలోని శకుంతలకు ప్రతిరూపం రుక్మిణీదేవి. మైసూరు వాసుదేవాచారియర్, టైగర్ వరదాచారియర్, కరైకుడి సాంబశివఅయ్యర్, బూదలూర్ కృష్ణమూర్తి శాస్త్రి, యమ్.డి. రామనాథన్ - యిలా ఎందరో సుప్రసిద్ధులకు 'కళాక్షేత్ర' వేదిక అయింది. ఈ క్షేత్రంలో భారతీయ సంప్రదాయం నెలకొనేందుకు పాపనాశమ్ శివన్ ఎంతో కృషి చేశారు.... సంప్రదాయం కాపాడుతూ కొత్త ఊపిరిపోయడం రుక్మిణీదేవి నృత్య నాటికలలోని ప్రత్యేకత, భీష్మ, బుద్ధ, కాళిదాసు కావ్యాలు, రామాయణ ఘట్టాలు - వీటిని చూస్తున్నప్పుడు, ఆ రమణీయ దృశ్యమాలికల నృత్య గీతికా వైభవంతో తన్మయులు గాక తప్పదు. భరతనాట్యానికి సామాజిక గౌరవమూ, సముచిత స్థానము చేకూర్చిన కళాభారతి రుక్మిణీదేవి. గురుదేవ్‌కి ప్రత్యామ్నాయం శాంతి నికేతన్; అలాగే రుక్మిణిదేవికి ప్రత్యామ్నాయం కళాక్షేత్ర....ఆమె రాజ్యసభ మెంబరుగా ఉన్న రోజులలో జీవకారుణ్యానికి సంబంధించిన బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టారు. (Bill for the Prevention of Cruelty to Animals) అప్పట్లో రాధాకృష్ణన్ వైస్ ప్రెసిడెంట్ (రాజ్యసభ చెయిర్‌మాన్). బుద్ధుడు పుట్టిన దేశంలో భూతదయ కరువవుతోందంటూ ఆమె చేసిన ప్రసంగాన్ని జవహర్‌లాల్ నెహ్రూలా మెచ్చుకుంటూ, 'నాగరికతకు, ప్రగతికి కొలమానం మనలోని హృదయ స్పందన, దయాగుణమునూ అన్నారు. లలితకళలు, నృత్య సంగీతాలు, చిత్రకళా, శిల్పకళా, కలంకారీ, చేనేత, హస్తకళలు .... 'కళాక్షేత్ర' అంటేనే ఒక కళామయ ప్రపంచం. జీవితంలో కళాత్మక విలువ లేనప్పుడు (non aesthetic) అది స్తంభీభూతమూ జడప్రాయమూ కాక తప్పదని రుక్మిణీదేవి విశ్వాసం..... భారత అధ్యక్షపదవి తనకి వొద్దనీ, ఆ పీఠం తన కార్యక్షేత్రానికి సంబంధించినది కాదనీ, అత్యున్నత అధికార స్థానాన్ని నిరాకరించగల మనోధృతీ, ఆత్మసంయమనం గల పరమపావన మూర్తి ఈ లలిత కళా జ్యోతి రుక్మిణీ

దేవి" - అన్నారు భారత రాష్ట్రపతి వెంకట్రామన్ కళాక్షేత్ర ఆడిటోరియమ్‌లో, ప్రఖ్యాత శిల్పి రాజగోపాల్ నిర్మించిన రుక్మిణీదేవి కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ! కళాక్షేత్ర అధ్యక్షులు శంకరమీనన్ స్వాగతం తెలిపారు. "భరత నాట్యానికి, సంగీత నృత్య నాటికలకు ప్రపంచ వ్యాప్తమగు ప్రతిష్ట తేవడమే గాకుండా, ఈ ప్రదర్శనలు చూసి ఆనందించేందుకే కాదు, ఆధ్యాత్మికతను మేల్కొల్పే సాధనా అని రుక్మిణీదేవి స్వయంగా చేసి చూపారు. వాటికొక వినూతనమగు ఆధ్యాత్మిక భావ పుష్టి నిచ్చారు," అన్నారు తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్. ఆర్వి రమణి వందన సమర్పణ.

..... 11

"లేత వయసులోనున్న కృష్ణమూర్తి, అతని సోదరుడూ సాష్టాంగ నమస్కారం చేశారు అనిబిసెంట్‌కు. ఆ క్షణాన ఆ బాలునిలో ఏదో దివ్యత్వం గోచరించిందామెకు; క్రీస్తు మళ్లీ జన్మించాడనే భావన కలిగింది .... బాలునిగా ఉన్నప్పుడే కృష్ణమూర్తిలో అపూర్వ ప్రతిభ వెల్లడయింది. .... తను ఒక అవతార పురుషునిగా తన చుట్టూ ఒక మహాసంస్థ అల్లుకుపోగా, తను సర్వసామాన్యుడననీ, 'గురువు' ఎంతమాత్రం కాదనీ ఆ సంస్థని రద్దు చేశారు జిడ్డు కృష్ణమూర్తి. ఆ తెగింపుకి ఎంతైనా ధైర్యమూ మనోబలమూ కావాలి. జిడ్డు కృష్ణమూర్తి నిరంతర పథికుడు - నిత్యసత్యాన్వేషి;



సినీప్రపంచం నూతన గాయకులను నిరంతరం ఆహ్వానిస్తూంటుందని అన్నారు ఛాంబర్ అధ్యక్షులు వెంకటేశ్వరన్ - డా॥ భరద్వాజ్ కాసెట్ల రిలీజ్ సందర్భంగా

వాస్తవికతను స్పష్టంగా చూడలేక తప్పటడుగులు వేయడం వల్లనే సమాజం కష్టాల పాలవుతున్నదని ఆయన అంటారు. నిశితమైన ఆయన బుద్ధి తీక్షణత లేసర్ కిరణం వంటిది. మద్రాసు, రుషీవాలీ, రాజ్ ఘూట్, వారణాశి, న్యూయార్క్, స్విట్జర్లాండ్ అన్నీ ఆయనకు ఒకటే! ఎక్కడ వున్నప్పటికీ ఆయన ఉనికిలోని కాంతి వెల్లువ చుట్టూవారి మనోమందిరాలలోని చీకట్లను తరుముతుంది. అంతర్వీక్షణ ఒక్కటే మానవుని చైతన్యవంతునిగా ఉంచుతుంది. కృష్ణమూర్తిలో మనం బుద్ధుని, జీసస్‌ని, శంకరుని చూడగలుగుతాం" - అన్నారు జెకె మెరియల్ లెక్చర్‌లో రాష్ట్రపతి వెంకట్రామన్, కృష్ణమూర్తి

ట్రస్ట్ వసంతవిహార్‌లో ఏర్పరిచిన శంకు స్థాపనోత్సవ సందర్భంగా. పుపుల్ జయకర్ యింట్లో కృష్ణ మూర్తిని, మూడునాలుగు తడవలు కలుసుకొనే మహద్భాగ్యం తనకు లభించిందనీ, మనని అవలీలగా మాటల్లోకి దింపి, ఒక మహాజ్ఞాని సమక్షంలో మనం ఉన్నామనే భావన మనకి కలగకుండా చేస్తారనీ, ఆయన ఆలోచనాసరళి అతి నిర్మలమైనదనీ అన్నారు తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్. జిడ్డు కృష్ణమూర్తి గురించి ప్రఖ్యాత గ్రంధం వ్రాసిన పుపుల్ జయకర్, ఈ ఫిలాసఫర్ బోధించినది భూతదయ. జీవించినది కరుణార్ద్రతలోను - అన్నారు. అచ్యుత్ పట్వర్ధన్ స్వాగతం తెలిపారు. క్షీరసాగరాశయనా, శాంతమూ లేక సౌఖ్యమూ లేదు మరో రెండు భజనలూ ఎంతో శ్రావ్యంగా, ఒక మహా జ్ఞానికి నివాళిగా పాడారు యమ్మెస్ సుబ్బలక్ష్మి.

. . . . . 21

"చిరునవ్వుతో అతి సౌమ్యంగా కనిపించే అకలంక ధీర చరితుడు ('gentle giant')) కస్తూరి శ్రీనివాసన్. పాతికేళ్ల ఆయన సారధ్యంలో 'హిందూ' పత్రిక, ఇండియన్ జర్నలిజమ్‌కి ఒక

పరవడి నేర్పరిచింది. యదార్థ వార్తలు, నిష్పాక్షిక దృష్టి, వాస్తవికతా వీక్షణ [accuracy, fairness and objectivity] ఈ మూడు అంశాలనూ కస్తూరి శ్రీనివాసన్ ఏనాడూ విడనాడేవారు కాదు. ప్రజాక్షేమమే తన లక్ష్యంగా, జంకు అనేదేమీ లేకుండా, పరుషమైన పదానికి చోటీయకుండా ధీరోదాత్తంగా 'హిందూ' పత్రికను నడిపిన మహానుభావుడాయన. ఇటు గాంధీగారికీ, అటు గవర్నర్ జనరల్‌కీ అభిమాన పాత్రుడైన మహావ్యక్తి.... టెక్నాలజీతోబాటు, కాల ప్రభావంతో బాటు 'హిందూ' కూడా మారింది. వారూ 'ఇన్వెస్టిగేటివ్ జర్నలిజమ్' వైపు మొగ్గుతున్నారు. అయితే వారి పరిశోధనాత్మక రచనలతో అసహనమూ ద్వేషమూ గాక అన్వేషణా చింతన కనిపిస్తుంది.... లిటరేచర్ ఆన్సర్స్ అయాక, ఢిల్లీలో లంక సుందరం 'ఇండస్ట్రీ అండ్ కామర్స్' పత్రికలో మూడు నెలలపాటు పని చేశాను; ఇంతలో 'హిందూ' వారి స్కాలర్‌షిప్ లభించింది; ఒక ఏడాది యిక్కడ పని చేశాను. ఆ ఆఫీసులో అప్రెంటిస్‌గా జాయినై కస్తూరి శ్రీనివాసన్‌ని మొదటి సారి ఆయన రూములో చూసినప్పుడు అనిర్వచనీయాను భూతి పొందాను. ఆ మహనీయునితో నేను మాట్లాడదగ్గ దేముంటుంది గనక— ప్రణామములు తెలిపేందుకు వెళ్లాను. శతజయంతి సందర్భంగా ఆ ధన్యజీవి చిత్రపటాన్ని మద్రాసు ప్రెస్ క్లబ్‌లో ఆవిష్కరించగల ఈ అవకాశం నా పాలిటి ఒక అదృష్టం" - అన్నారు యూనియన్ మినిష్టర్ ఆఫ్ స్టేట్ ఫర్ సైన్స్ అండ్ టెక్నాలజీ కెఆర్ నారాయణన్, మద్రాసు ప్రెస్ కాంపవుండ్‌లో జరిగిన ఫంక్షన్‌లో, పెద్ద పత్రికల ప్రాంతీయ ఎడిషనులు, దేశసమైక్యతకు దోహదకారి కావడం లేదు సరిగదా, స్థానికవార్తలతో సంకుచితత్వం పెంపొందిస్తున్నా యనీ, మంత్రులనీ రాజకీయ నాయకులనీ మరీ పెద్ద చేయడం గాక, ప్రజాసమస్యల వైపు దృష్టి మరల్చాలనీ సూచించారు నారాయణన్.... "ఆర్థికంగాను, పారిశ్రామికంగాను పెరిగినంత మాత్రాన అది ప్రగతి అనిపించుకోదు. కుల విభజన లేని గ్రామం, అన్ని కులాల వారూ ఒకే వీధిని నడుస్తూ ఒకే బావి నుంచి నీరు చేదుకోగల గ్రామం మచ్చుకి ఒక్కటైనా ఉందా ఈ సువిశాల భారతంలో" అని ప్రశ్నించారు అడ్వయిజర్ పద్మనాభన్, - సావనీర్ విడుదల చేస్తూ.... ప్రెస్ క్లబ్ అధ్యక్షులు డి ఆంజనేయులు కస్తూరి శ్రీనివాసన్ గుణగణాలు ప్రశంసించగా, కార్యదర్శి శౌరి, కస్తూరి శ్రీనివాసన్ పేరిట స్మారకోపన్యాసం ప్రతి ఏడూ ఏర్పాటు చేస్తామన్నారు. బివి రంగనాథ్ ఈనాటి సభా కార్యక్రమాన్ని నిర్వహించారు.

.....22

అభ్యుదయ రచయితల సంఘం - మద్రాసు శాఖ, యివ్వాళ పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో 'నేటి పత్రికలు - కల్పనా సాహిత్యం'

అనే విషయంపై గోష్ఠి జరిపింది. 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో వెలువడ్డ ధారావాహిక నవల 'కామోత్సవం' (శేషేంద్ర శర్మ) యువతను రెచ్చగొట్టి దిగజార్చేదిగా ఉన్నదని సాయీ ప్రసాద్, వనితల పత్రికలలో సబ్బుతే తప్ప హానికరమైన వేవీలేవని సరోజినీ ప్రేమ్‌చంద్, నేటి వారపత్రికలలోని బొమ్మలూ కథలూ సెక్స్‌మయం అని కనకదుర్గ, 'ఆంధ్రభూమి' మాసపత్రిక 'స్వాతి' మాసపత్రిక పేర్కొంటూ ఈ పత్రికలలోని రచనలలో హర్రరూ, క్రయిమూ, సెక్సూ తప్ప సాహిత్య విలువలేమీ లేవని వైవియస్సెస్సెన్ మూర్తి తమ ప్రసంగాలలో చెప్పారు. జివియస్సార్ కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. అష్టపదుల జయదేవ్‌ని ఆనాడు అశ్లీల సాహిత్యకారుడు అని అనలేదా అని పార్థసారథి '(యు.యన్.ఐ') ఈ పత్రికలని సినిమాలనీ అత్యధిక శాతంలో ఆదరిస్తున్నది స్త్రీలేనని జగన్నాథస్వామి ('ఈనాడు'), శేషేంద్ర శర్మ కవిత్వాన్నీ పత్రికా పాఠకుల కోసం వ్రాసిన ఈ నవలనీ దేనికది వేరుగా చూడాలని ప్రేమ్‌చంద్, ప్రసంగానంతరం జరిగిన చర్చలలో తమ అభిప్రాయం తెలిపారు. నేటి వ్యవస్థలో పత్రికా ప్రచురణ 'సప్లయ్ అండ్ డిమాండ్' సూత్రానికి లోబడి నడుస్తున్న వ్యాపారం.

—యన్నార్ చందూర్

# ముఖచిత్రం

"'నా కింక చదువు కోవాలని లేదు - సినిమాల్లో యాక్ట్ చేస్తాను' అని నేనన్నప్పుడు మా ఫాదర్ (పృథ్వీరాజ్ కపూర్), 'అలాగే కానియ్ - కాని నేను నీ కిచ్చేది నెలకు పది రూపాయిలు పాకెట్ మనీ మాత్రమే' అన్నారు. బొంబయి వర్షాలలో తడవకుండా ఒక గొడుగు, కాన్వాస్ షూస్, ఆ పదిరూపాయిల నెలసరి పాకెట్ మనీతో స్టుడియో సెట్స్‌లోకి ప్రవేశించాను. ఏడేళ్లపాటు యప్రంటీస్‌ని. కుర్చీలు మోశాను, లైట్లు పట్టుకున్నాను, ఆ నాటి ప్రఖ్యాతులు చెప్పినది వినమ్రంగా ఆచరించాను. వెలుగు జిలుగుల ప్రపంచంలో పెద్దలు చెప్పినది అణకువతో పాటించాను. అలా ఏడేళ్ల శిష్యరికం చేశాక, అన్ని శాఖలలోను అంతో యింతో అనుభవం గడించాక, స్వంత ప్రయత్నం ప్రారంభించాను. అగ్, బర్సాత్‌ల తర్వాత 'ఆవారా' నాకు అఖండ ఖ్యాతి తెచ్చిపెట్టింది.... నర్గీస్‌ని మా చిత్రంలో బుక్ చేయడానికి వారింటికి వెళ్లాను - అప్పటికి ఆమె వయసు పదహారు. నాజీవితం, నాపేరు ప్రఖ్యాతులు. ఈ ఆర్‌కె సంస్థ, నా సంపద, నా సమస్తం నర్గీస్‌కి ఎంతగా రుణపడి వున్నాయో మాటలలో చెప్పలేను. ఆమె ఒక అమృతమూర్తి.... అలాగే, 'మై ఆవారా హూం' అని నేను పాడుతున్నట్టుగా నాకు గళమిచ్చి, దేశ దేశాల ప్రజను సంగీతఝురిలో వోలలాడించిన ముఖేష్, నా వెండి తెర రూపంలోని అంతర్భాగమే కాదు, ఆ రూపానికి జీవనాడి. ఆ ముఖేష్ గాత్రమే లేకపోతే ఈ రాజ్ యింత వాడయేవాడా ? .... ఆత్మసఖులు వెళ్లిపోగా, నేను చూస్తున్నది శూన్యంలోకా, లేక, పొగమంచు ఆవరించిన ప్రకృతి లోకా ?" - అంటూ ఆత్మావలోకనం చేసుకున్నారు రాజ్‌కపూర్, 'లివింగ్ లెజెండ్' అను టివి చిత్రంలో. ఇండియన్ ఫిలిమ్ ద్వారా భారతీయతను 1953 నాటికే విదేశాలలో విస్తరింప జేసిన ఘనత రాజ్‌కపూర్‌ది. సోవియట్ రష్యాలోను, కమ్యూనిస్ట్ చైనా లోను ఆయన చిత్రాలు పొందిన ఆదరణ సినీకళ రాజకీయాలకు అతీతమైనదనేందుకు ప్రబల నిదర్శనం. ఈ సంవత్సరం ఫాల్కె అవార్డ్ పొందిన రాజకపూర్ దృష్టిలో చలన చిత్ర కళ ఒక షో-బిజినెస్ - రసజ్ఞతా విలువలు పరిరక్షిస్తూ, ప్రదర్శనను రక్తి కట్టించాలి. స్టుడియో అనే విశ్వ విద్యాలయంలో కళాజ్యోతి వెలిగించిన ప్రజ్ఞానిధి రాజ్‌కపూర్. ✳

---

నా వద్ద ప్రేమ తప్ప మరొక ఆయుధం లేదు. ప్రపంచంతో స్నేహం చేసుకోడమే నా గమ్యం. —గాంధీజీ

సమీక్షలు

# చిత్రజగతి

## కృషి నికేతన్ వారి 'ఊరేగింపు'

సత్యం మాస్టారు (ప్రభాకరరెడ్డి) గాంధేయవాది - అహింసా సూత్రాల ప్రకారం నడుచుకొనే ఆదర్శవాది. రోడ్డుకి వోరగా కుంపటి పెట్టుకు అట్లు వేసి అమ్ముకొనే పేదరాలు (నిర్మల), ఇరువర్గాల మధ్య నున్న శత్రుత్వానికి సంకేతంగా డప్పు వాద్యగాడు (పియల్ నారాయణ), తోపుడు బండిలో కూరలమ్ముకొనే ఆ వాద్యగాని కొడుకు, స్వాతంత్ర్య పోరాటంలో జైలు కెళ్లిన వారికి ప్రభుత్వం పెన్షన్ మంజూరు చేసినా చేతికందని సీనయ్య, ధనం గలవాడు చట్టాన్ని చుట్టంగా చేసుకు పేదల బతుకులతో గోళీకాయలాడుతున్నప్పుడు, శ్రీరామునిలా ధనుర్ధారి కావాలి, లేదా, శ్రీకృష్ణునిలా చక్రం ధరించాలి, అంతేగాని ఈ మేక తన్నెపులుల ముందు ధర్మపన్నాలు పనికిరావనే తీవ్రవాది శివాజీ (శివకృష్ణ), మోటారుకారూ, జీపూ, పోలీసు బలగం, తన వెనకరాగా, రెండెడ్లబండి ఎక్కి వచ్చి, -యమ్మెల్యే చేసిన తప్పిదాన్ని (పేదల యిళ్లు తగలబెట్టించడం) సరిదిద్దబోయే మంత్రిగారు (కోట శ్రీనివాసరావు) మున్నగు పాత్రలు నేటి సామాజిక పతనాన్ని, పోలీసు జులుమ్‌నీ, ధనమదం అధికారలాలస తప్ప ఏ విలువా లేని వర్గం, పరిశుభ్రమైన గాలి వీచే గిరిజన ప్రాంతాలను న్యాయం పేరిట తమ దోపిడీ కోసం ఎలా తూటాలతో కలుషితం చేస్తున్నదీ, గుండెని గుబులెత్తించే కమీషనుల తమాషా తస్సాదియా పోలీసోళ్లు వంటి పాటలతో చూపారు దర్శకులు పియల్ నారాయణ.

## కళ్యాణీ కంబైన్స్ 'పృథ్వీరాజ్'

నగల కోసం నలుగురు రౌడీలు తరుముకుంటూ రాగా, సబ్‌వేలో ఆ దంపతుల పాలిట ఆర్తత్రాణ పరాయణుడై, రౌడీలని చితకబాది నగలు వారికిప్పిస్తాడు ఒకనాటి పోలీసాఫీసరైన 'పృథ్వీరాజ్' (కృష్ణంరాజు). కాలేజీలో చదువుతున్న ఆయన కూతురు లలితకు (గౌతమి) ఆత్మరక్షణలో శిక్షణనిస్తాడు. ఒక రోజున నలుగురు పాత విద్యార్థులు క్లాస్ రూమ్‌లోకి వచ్చి, ఒక లేడీ స్టూడెంట్ జడ కత్తిరించబోగా, పప్పుసుద్దలాంటి ప్రిన్సిపాల్

ఆ ధనిక యువకులకి సలామ్ చేస్తాడు; లలిత తిరగబడి, ఆ నలుగురికీ యావన్మంది ముందూ బుద్ధి చెబుతుంది. అయితే ఆ ఫైటింగులో మణికట్టువద్ద ఫ్రాక్చరవుతుంది. తండ్రి పృథ్వీరాజ్ కేసు పెడతాడు; ప్రిన్సిపాల్ సహకరించడు; పోలీసులు పట్టించుకోరు - ఎందువల్లనంటే ఆ నలుగురిలో మంత్రిగారి (ప్రభాకరరెడ్డి) అబ్బాయి (సుధాకర్) ఉన్నాడు. లలిత ఒక యువకుని (తులసీరామ్) ప్రేమిస్తుంది; పృథ్వీరాజ్, వారి ప్రేమ ఎంత స్వచ్ఛమైనదో పరీక్ష పెట్టి, పెళ్లిజరిపిస్తాడు; హనీమూన్‌కి వెళ్తున్న నవదంపతులతో బాటు అతనూ వెళ్తాడు - కూతురిని వొదిలివుండలేక! అక్కడ సముద్ర పొడ్డున, వెనకటి పాత విద్యార్థులు నలుగురూ లలితను దారుణంగా రేప్ చేసి, ఆమె భర్తను చంపేస్తారు. కూతుర్ని చేతుల్లో పుచ్చుకు పోలీసు స్టేషన్ కొస్తాడు పృథ్వీరాజ్. ఇనస్పెక్టరైతే కంప్లయింట్ తీసుకుంటాడు గాని మంత్రిగారి తొత్తు అయిన కమీషనర్ ఆ ఫైల్ కాల్పించేస్తాడు. నలుగురు దుష్టులనీ పృథ్వీరాజ్ తన కర్తవ్య నిర్వహణలో అంతమొందించడం, 'ఇదం క్షాత్రమ - ఇదం బ్రాహ్మమ్' అంటూ వారిని హోమాగ్నికి సమిధిలు గావించడం, చిన్ననాటి ఫ్రెండ్ అశ్వని (జయసుధ) తటస్థపడటమూ యిలాటి వాటితో నాటకీయత, సస్పెన్సూ పాత్రోచిత న్యాయమూ ప్రశంసనీయంగా వున్నాయి. అయితే పోలీసు శాఖ యింత అస్తవ్యస్తంగా ఉందా, వారు యింతటి హేయమైన దారుణాలు చేస్తున్నారా, హీరోని సూపర్ మాన్‌గాను వారిని నరరూప రాక్షసులుగాను చిత్రించడం సమాజ పరంగా శ్రేయస్కరమా అనే సందేహం కలగక మానదు. ఈ సినిమాస్కోప్ చిత్రానికి దర్శకులు: పేరాల.

## తేజా ఆర్ట్ వారి 'కనక మాలక్ష్మి'

రికార్డ్ డాన్సింగ్ ట్రూప్ అనగా ప్రముఖ నటీ నటుల పాటల రికార్డ్ మైకులో వినిపిస్తూండగా, రంగస్థలం మీద ఆ యా నటీ నటుల పాత్రలు ధరించిన యువతీ యువకులు, ఒరిజినల్ ఫిలిమ్‌లోని డాన్సుని యథాతథంగా అనుకరిస్తూ ప్రేక్షకులని మెప్పించడం! ఇటువంటి ఒకానొక ట్రూప్‌కి మేనేజరు పాపారావు (కోట శ్రీనివాసరావు), అతని మేనల్లుడు దొరబాబుకి (భరణి) తమ ట్రూప్‌లో కొత్తగా చేరిన సీత (మాధురి) మీద ఆశగా ఉంటుంది. అయితే, ఆ సీత (నిర్మల మనుమరాలు), పిరికి వాడైన గోపాలంలో (నరేష్) తెగింపు తెప్పించేందుకు, మగాడైన మాత్రాన చాలదు మొగుణ్ణి చేసుకోవాలనే పట్టుదలతోను, ఈ ట్రూప్‌లో చేరివున్నదవడం చేత, నిద్రపోతున్నప్పుడు ఆ గోపాలం తన మెడలో వేసిన పసుపు తాడుకి మురిసి పోతుంది. ఎంటర్ టైన్‌మెంటు ఉంది. గాని కథలో బిగువు లేదు. దర్శకత్వం: వంశీ. ❋

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణారెడ్డి

'భానూ....' 'ఇంద్ర ధ నుస్సు' 'కోణార్క' వంటి నవలలలో, తన దంటూ ఒక ప్రత్యేక బాణీ, తనకంటూ ఒక ప్రత్యేక స్థానమూ ఏర్పరుచుకున్న అన్నపూర్ణారెడ్డి సరికొత్త నవల ఈ నెలనుంచీ ధారావాహికంగా వెలువడు తోంది.... డాక్టరు సారధికి, జానకికి గల అనుబంధం ఎటువంటిది? పిల్లలిద్దరూ ఆమెని 'పిన్నీ' అని ఎందుకు పిలుస్తున్నారు? వృత్తిధర్మానికి అంకిత మైన వ్యక్తిని పల్లెటూరి ప్రజ ఎందుకు గౌరవించదు?.... ఇక చదవండి. ✻

మువ్వల చప్పుళ్లు, అదలింపులు కాలి సవ్వడులు - చప్పున మెళకువ వచ్చింది విజ్జికి, రోజూ విన్పించే బస్సుల హారనులు, రిక్షా మోతలు, మనుష్యుల సందడి వీటికి విభిన్నంగా వుండడంతో ఏదో అంతా క్రొత్తగా అనిపించింది.

నిద్రలో జారిపోయిన రగ్గును పీకల దాకా లాక్కొని ముణగ దీసుకొని పడుకొంటూ ప్రక్క మంచం మీద పడుకున్న రవికేసి చూసింది విజ్జి.

నిద్రలో ఏమిటో, నవ్వుతున్నాడు రవి. నవ్వు నిద్రా భంగం కలిగించింది కాబోలు గభుక్కున కళ్లుతెరిచి తనవంకే చూస్తున్న చెల్లికేసి చిరునవ్వు చిందించాడు.

ఏదో గుర్తొచ్చిన వాడిలా చప్పున లేచి కూర్చొని గదిని పరికించి చూశాడు. అన్నను అనుసరించింది విజ్జి. ఇద్దరి కళ్లూ విచిత్రంగా కదులుతూంటె వారి ముఖకవళికల్లోని భావాలు వర్ణనాతీతం.

వెల్ల వేసిన రాతి గోడలూ రెల్లుతో కప్పిన పైకప్పు, రాత్రి నిద్ర కళ్ళతో సరిగా చూడని ఆ పరిసరాలను చూస్తుంటె గుర్తొచ్చింది. రాత్రి బస్సు దిగే సరికి బస్సు దగ్గర ఎడ్ల బళ్లతో తమ నాన్న సారధి, కొంతమంది మనుష్యులతో ఎదురు చూస్తూ వుండడము, ఆపై సామానులు రెండు బళ్ళలో, తాము జానకి, తండ్రి. మరో బండిలో కూర్చొని రావడము, ఆ తరువాత ఇప్పుడే మెళకువ రావడము.

ఇద్దరూ మంచాలు దిగి తలుపు రెక్కలు తెరిచే సరికి శీతాకాలపు చలి గాలి రివ్వున లోనికి దూసుకొచ్చి చుట్టేసింది.

రెండు చేతులూ ఇంటూలా, భుజాల చుట్టూ నొక్కుకొని 'ఉహుహూ' అని వసారాలోకి అడుగు పెట్టారు.

రాత్రి వచ్చిన ఎడ్ల బళ్లు ఎక్కడా అవుపించలేదు గానీ వీధిలో ఎడ్లను అదిలించు కొంటూ, నాగళ్లు భుజాల మీద మోస్తూ రైతులూ, నీళ్ళబిందెలు తలల మీదా భుజాల మీదా ఎత్తుకొని ఎవరో తరుముకొస్తున్నట్టు నడుస్తున్న ఆడవాళ్లూ అవుపించారు.

వసారా దిగి ఇంటి ముందున్న వేప చెట్టు కేసి నడిచారు ఇద్దరూ.

కుతూహలంతో చుట్టూ పరికించారు. అదో పల్లెటూరు. ఇద్దరూ ముఖా ముఖాలు చూసుకున్నారు.

ఇళ్ళ ముందు పశువుల సావళ్లు, ఆ ప్రక్కనే పెంటపోగులు. మరికాస్త దూరాన గడ్డివాములు.

'అన్నయ్యా! ఇదేంటి.... పల్లెటూరంటే ఇలాగేనా వుంటుంది?' అడిగింది విజ్జి. ఆ గొంతులో ఏదో తెలియని విముఖత, నిరాశ ధ్వనించాయి.

"అవును కాబోలు - నాకూ తెలియదు. ఇక ఇక్కడే వుండాలి కాబోలు మనం .... ఈ రొచ్చులో .... పెంటల్లో" - రవి సమాధానంలో అసహ్యం, అక్కసు....

బాబ్డ్‌హెయిర్, స్లీవ్‌లెస్ సాదా ఫ్రాకు, చేతికి ఒక్క పెద్దగాజు, చెవులకు రింగులు, కాళ్ళకు స్లిప్పర్లు, చంద్ర బింబం లాటి ముఖంకు పెద్ద పెద్ద కళ్లు, ఆరోగ్యంగా బొద్దుగా ముద్దొచ్చే ఆకారం.... పసిమిఛాయలో విజ్జి, ప్రక్కనే చామన ఛాయలో, కొనదేలిన ముక్కు, కొద్దిగా నలిగిన పేంటు, ఫుల్‌షర్టు, కాళ్ళకు స్లిప్పర్లు తొడుక్కొని చెట్టు క్రింద నిలబడ్డ ఆ చిన్నారి బాలలను చూసేసరికి దారిన పోతున్న వాళ్లు 'మన క్రొత్త డాక్టరు గారి బిడ్డలు గామాల' అనుకొంటూ వెనక్కి చూస్తూ వెళ్లిపోయారు.

పాల కోసం, తల్లి పొదుగులో కుమ్మి, రెండు గుక్కలు తాగి, ఉత్సాహంతో గంతులేసే లేగదూడలు పరుగు పందాల్లో లాగ రయ్యిన దూసుకు రావడము, చెట్టు క్రింద నుంచున్న అన్నా చెల్లెళ్ళను చూడ్డమూ ఓ గడియసేపు బెదరిపోయి ఆగి, తిరిగీ తల్లి గుర్తు వచ్చినట్టు దూసుకువెళ్ళే లేగలను చూస్తూ, అప్పటిదాకా పల్లెటూరని మనసులో నిరుత్సాహపడ్డ విజ్జి, రవిలు హాయిగా నవ్వుకున్నారు.

ఆ లేగలు అలా ఒకటి అదా పలుకరించి వెళుతూంటె అలాగే పొదివి పట్టుకోవాలని వింత కోర్కె కలిగిందా ఇద్దరి ఎదల్లో.

రోడ్డుకు ఆవలి వేపు నున్న వింత చెట్టు కొమ్మలను చీల్చుకొంటూ లేత అరుణ కిరణాలు పలుకరించాయి.

సుస్వాగతం లంటూ పల్లెటూరిని ఆవరించిన పొగ మంచు అరుణోదయ బింబాన్ని చూస్తూ మర్యాదగా ప్రక్కకు తప్పుకోసాగింది.

తమ ఇంటికి అల్లంత దూరంలో వున్న ఇంటి వెనుక నుండి ఇంచు మించు తమ ఈడే వున్న ఒక కాలి జారిపోతున్న నిరుగుల నిక్కరును ఓ చేత్తో ఎగదోసుకుంటూ మరో చేత్తో పొడవాటి పుల్లనోదాన్ని పట్టుకొని కుక్కపిల్లను బాదుతోంది. కర్కశంగా అరుస్తున్న ఆ కుక్క

ఏడుపు వింటూ అప్పటిదాకా లేగ దూడల బోద్యాన్ని ఉత్సాహంతో గమనించినది మర్చిపోయి "పాపం ఆ పప్పీని చంపేస్తున్నాడు వెధవ" అంది భయంతో విజ్జి.

అప్పుడే వ్యాహ్యాళి ముగించుకొని వచ్చిన డాక్టరు సారధి పిల్లల భుజాల మీద చేతులేస్తూ "అప్పుడే అయిపోయిందా మీ నిద్ర" ఆప్యాయంగా పలుకరించాడు.

కుక్కపిల్ల ధ్యాసలో వున్న విజ్జీ రవీ తండ్రి పలుకరింపుకు ఉలిక్కిపడి "గుడ్ మాణింగ్, డాడీ" అన్నారు ఏక కంఠంతో.

"గుడ్ మాణింగ్" బదులిచ్చాడు సారధి.

ఆదుర్దాగా వసారాలోకి వచ్చిన జానకి "హమ్మయ్య. మీరు ఇక్కడ వున్నారా? ప్రక్కల మీద లేక పోయే సరికి ఏమయిపోయారో అని హడలు కొట్టుకున్నాను. అసలే.. ఊరు క్రొత్త .... పరిసరాలు క్రొత్త.... " - గొణుక్కుంది.

జానకి ముఖంలోని ఆదుర్దా గమనించి చిన్నగా నవ్వుకున్నాడు డాక్టరు సారధి.

తలారా స్నానం చేసి, జారుగా ముడి వేసిన వెంట్రుకలు వీపు నంతా తడుపుతూంటే ఆ ప్రభాత వేళ అతి సామాన్య దుస్తుల్లో అతి సామాన్యమైన అందంతో పాతికేళ్ళయినా నిండని జానకి ముఖాన్ని ఓ సారి చూచి తండ్రీ బిడ్డలు మారు మాటాడకుండా జానకిని అనుసరించి ఇంటిలోకి వెళ్ళారు.



నెహ్రూవాణి

నన్ను ఈ దేశపు ప్రధాని అంటున్నారు; అందుకు బదులుగా ప్రథమ సేవకుడు అంటే బావుండును. పదవులు, అధికారాలు కంటే సేవాభాగ్యం ఎంతో గొప్పది.

1947 డిసెంబరు 01



"అయ్‌గోరూ . ." ఓ బొంగురు కంఠం విని, "లేవకండి .... నే వెళ్ళి చూస్తాను." అంటూ టిఫిన్ ప్లేటు ముందు కూర్చున్న సారధిని వారించి పమిట నిండుగా కప్పుకొని వీధి గుమ్మం లోకి వచ్చి తలుపు ప్రక్కగా నుంచొని "ఎవరు కావాలి ?" అంది జానకి.

మట్టి గొట్టుకొని ఎర్ర పడ్డ ముతక పంచె మోకాళ్ళ పైకి ఎగగట్టి అలాటిదే బనీను తల పాగాతో వసారా దిగువ నుంచున్న ఓ లావుపాటి మనిషి, చేతిలోని పాలచెంబు ఎదుట వుంచి, తలమీద సంచి దించి వసారా అంచున వుంచి, "మునసబు గోరు పాలూ కూరలు పంపించినారండీ" అన్నాడు కాస్త గట్టిగా. వాడి మాటలో వాడి కామందుల వారి దర్జా దర్పం తొంగి చూశాయి.

అదేసమయంలో మరో దిశనుండి మరో పాలేరు సరాసరి వసారా మెట్లెక్కి గుమ్మంలో పలికి వస్తూ "అయ్యగారూ" అని పిలిచాడు.

'ఎవరూ' అంటూ టవలుతో చేతులు తుడుచుకుంటూ సారధి వచ్చాడు.

''కరణం గోరు టిఫిని, ఫ్లాస్కులో కాపీ పంపించినారండీ'' అన్నాడు కాస్త వినయంగా, చేతులు కట్టుకొని.

ఇప్పుడెందు కివన్నీ - అన్నట్టు జానకి, సారధి ముఖంలోకి చూచింది.

తల పంకించి.... 'మీ కామందుల వారికి థాంక్స్ చెప్పండోయ్'' అంటూ ఆ వస్తువులను ఇంట్లోకి జేరవేశాడు సారధి.

''బాబుగారు'' అంది జానకి.

''అర్థమైంది, జానకీ.... కానీ మనం వున్న పరిసరాలూ ప్రదేశాలు వేరే. ప్రస్తుతం వుండడానికి వచ్చింది పల్లెటూరు. అందులో సాంప్రదాయాలూ, మర్యాదలూ అలవాట్లు వేరే.... నొప్పించక, తానొవ్వక అన్న సూక్తి తూచ తప్పకుండా పాటిస్తే గానీ జీవితం సాఫీగా గడవదు'' అన్నాడు గంభీరంగా.

మరేం మాట్లాడకుండా పాలచెంబు దాకలో దిమ్మరించి, ముయిమీద పెటి కూరలు బుట్టలోకి సర్దింది.

రవి, విజ్జీ టిఫిను తినేసి ప్రక్క గదిలోకి వెళ్ళారు. రాత్రి బళ్ళమీద దింపిన సామాను అంతా చిందర వందరగా పడివుంది ఆ గదిలో.

విశాలమైన నాలుగు గదులు వెనుక ఓ చిన్న వంటిల్లు స్నానాలగది. ఓ చిన్న పెరడు, పెరట్లో బావి. విద్యుద్దీపాలు. ఇల్లంతా కలియతిరిగి ఫరవా లేదని మనసు సర్దుకున్నారు. అన్నాచెల్లెళ్ళు.

సారధి డ్రెస్ చేసుకొని ''జానకీ, నేను ప్రైమరీ హెల్త్ సెంటరుకు వెళ్తున్నాను.'' అంటూ వంటింటి గుమ్మం ముందు నుంచుని నెమ్మదిగా చెప్పి బైటకు నడిచాడు.

తండ్రికి ''టాటా'' చెప్పి వంటింటి గుమ్మంలో నుంచొని ''పిన్నీ మా పుస్తకాలు అవీ ఎక్కడసర్దావు?'' అన్నారు.

''రవీ! ఈ పూటకు చదువక పోతే ఫరవాలేదులే. ఆ సంచిలో .... మీ ఆటసామాన్లు వున్నాయి. ఆడుకోండి. వీధిలోకి వెళ్ళకండేం'' అంటూ హెచ్చరించింది జానకి.

చదువు వద్దనే సరికి సంబరమైపోయింది. ప్లాస్టిక్ సంచిలోంచి కీ ఇచ్చే విమానము, బంతి తీసుకున్నాడు రవి. తన బొమ్మలు తీసుకుంది విజ్జి. వరండాలోకి వచ్చి కాస్సేపు ఆడుకున్నారు ఇద్దరూ.

కాస్సేపు ఆడేసరికి విసుగొచ్చి అవక్కడ వదిలేసి నెమ్మదిగా వీధిలోకి జారుకున్నారు.

ఇందాకటి చింత చెట్టుక్రింద కొంత మంది పిల్లలుచేరి గోలీకాయల ఆడుకొంటున్నారు. వాళ్ళలో కుక్క పిల్లను ఏడ్పించిన పిల్లవాడున్నాడు.

స్నానం చేసి బట్టలు మార్చుకొని తలలు దువ్వుకొని కడిగిన ముత్యాల్లా వున్న అన్నా చెల్లెళ్ళను ఆడే ఆట ఆపేసి కళ్ళప్పగించి చూడసాగారు.

''ఇదిగో''. - అంటూ కుక్క పిల్లను కొట్టిన శాస్త్రిని పలుకరించింది విజ్జి.

వాడి కళ్లు విచిత్రంగా మెరిసాయి. 'నేనా' అంటూ

బిడియంగా తగర వచ్చి నుంచున్నాడు. ''స్కూలుకు నీవు వెళ్ళలేదా?'' అంది విజ్జి.

"అంతే.... బడా.... ఉహెూ !.... నేను ఎల్లను...." కాస్త గడుసుగా బదులిచ్చాడు.

"ఎందుకనీ ?"

"నేనే కాదు.... ఈల్లూ ఎల్లరు"

తన బలగం తక్కువేం లేదనట్టు కాస్త గర్వంగా అన్నాడు.

"అదే.... ఎ ం దు క ని ?" రవి కల్పించు కున్నాడు.

విజ్జీని చూస్తే వేయనిభయం, రవి పలుకరింపుతో కల్గింది.

"మరే.... మరే.... పగలంతా ఆడ బల్లో కూకు నుండాలంటె.... ఏంబా గోదు.... పంతుల్లు అదే అయ్యోరు.... చింత బరికెతో ఈ పు మీ ద బాదే స్తాడు...." "గోలీ కాయలు బిళ్ళం గోడూ ఆశ్డానికి ఈలుపడదు...." ఒక్కో కంఠం నుండీ ఒక్కో జవాబు.

అన్నా చెల్లెళ్ళ ముఖాముఖాలు చూచు కున్నారు. ఆ తరువాత అంతా కబు ర్లలో పడ్డారు.

## 2

యాభై గడపగల ఆ పల్లెటూళ్ళో వేళ్ళమీద లెక్కించ తగ్గ డాబా యిళ్ళు మునసబు, కరణాలు ఇద్దరు ముగ్గురు భూస్వాములవి. అన్ని పల్లెటూళ్ళలో లాగే ఓ పాడుపడ్డ శివాలయం. ఊరి మధ్య రచ్చబండ, ఊరి పొలిమేర అమ్మవారి గుడి, ఓ చిన్న చెరువు, రా మా ల య ం, పేరుకు ఓ గ్రంథా లయం, విసిరేసినట్టు ఊరికి బాగా దూరంగా క్రొత్తగా కట్టిన పి. హెచ్.సి, (ప్రైమరీ హెల్త్ సెంటరు). చుట్టుపట్ల ఇరవైమైళ్ల దాకా వున్న ఊళ్ళలో వారికిఅదే వైద్యశాల. ఆస్పత్రి సిబ్బంది కోసం, అద్దెలమాట కనీవిని ఎరగని ఊరివాళ్లు, పోటీపడి అద్దెల కివ్వడం నేర్చుకున్నారు.

రోజులు నెమ్మదిగా జా రి పో తు న్నాయి.విజ్జి, రవి స్కూలులో చేరారు. విజ్జి రెండవ తరగతి, రవి మూడవ తరగతి. అప్పటిదాకా కలవారి వీధి అరుగుల మీద చెప్పబడుతున్న బడి, ఈ మధ్య ఊరికి ఉత్తరంగా కాస్త ఎడంగా కట్టిన చిన్న మూడు గదుల పెంకుటింటిలోకి మారింది.

మెల్లమెల్లగా ఇరుగు పొరుగు పిల్ల లతో మాటలు కలిశాయి. పక్కింటి కుర్రవాడు విజ్జీని చూస్తూ అలా గంటల తరబడీ నుంచుండి పో యే వా డు. వాడలా మైమరచి నుంచుండి పోతే "ఏయ్.... నారిగా సన్నాసి వెధవా.... సచ్చినోడా.... ఎక్కడ తగలడ్డా వురా?" అంటూ ప్రేమగా వాళ్ళింట్లో నుండీ పిలుపు లందేవి.

దాంతోవాడు నిక్కరు ఎగదోసు కుంటూ "వస్తున్నా.... పెద్దమ్మా" అంటూ తూరీగలాగ పరుగెట్టేవాడు.

వాడు తమ స్నేహాన్ని కోరుతున్నా డని విజ్జికి అనిపించింది.

ఆడపిల్ల మనసు అతి సున్నితమం టారు. విజ్జిలాటి అమ్మాయి మరీను. తాను ఆ కుర్రవాడిని పిలిచి పలక రించింది. వాడిపేరు నారాయణ అని తెలిసింది.

"నారాయణా.... అ స్త మా న ం ఇంట్లో కోడిని కుక్కనూ తరుముతో కూర్చుంటే ఏమి తోస్తుంది ? బడిలో

చేరకూడదు, ఎంచక్కా మన మంతా ఓ జట్టుగా వెళ్ళిరావచ్చు.... ఏం ?" అని పూరించేది విజ్జి.

పెద్ద పెద్ద నల్లటి కళ్ళతో విజ్జి వంక చూస్తూ.... 'ఉహూ' అనేవాడు

"ఎందుకని.... చదువంటె ఇష్టం లేదా ?" రెట్టించింది విజ్జి.

"కాదు, విజ్జీ.... పెద్దమ్మ పంపదు. సదుకోవాలనివుంది.... కానీ...." అంటూ గుడ్లనీరు కుక్కుకొనే వాడు.

జాలిగా వాడివంక చూస్తూ "పోనీలే ఇంటిదగ్గరే ఆడుకుందాం!.... కబుర్లు చెప్పుకుందాం" అంటూ ఆరిందాలా వూరడించేది విజ్జి.

ఆమాత్రం ఆదరణ, ఆప్యాయతకే ముఖం వాచినట్టు వాడు మురిసిపోయే వాడు.

పిల్లలు నెమ్మదిగా ఆ పల్లెటూరికి అలవాటు పడ్డారు. అయినా స్కూల్లో లేదా ఎవరేనా తమ గురించి అడిగి నపుడు మాత్రం పట్టణంలో బస్సుల గురించి, పెద్దపెద్ద మేడల గురించి, సినిమాల గురించీ తెగ చెప్పేవారు.

డాక్టర్ సారథి పల్లెటూరి రాజకీయా లకు ఏ మాత్రం తలవంచకుండా మొదట నుండీ అందరి పట్లా సమా నత ప్రదర్శిస్తూ తలలో నాలుకలా మసలుతూ నెమ్మది నెమ్మదిగా, ఫరవా లేదు డాక్టరు - హస్తవాసి మంచిది' అని పేరు తెచ్చుకొంటూ తన వృత్తి అంకితమయ్యారు.

పిల్లలు స్కూలుకు, సారథి హాస్పిటలుకి వెళ్ళాక నెమ్మదిగా ఇంటి పని, వంటపని చూసుకొని ఆ తరువాత

చదువు కుంటూనో కుట్టు కుంటూనో గడిపేది జానకి. సాయంత్రం పిల్లలను కాస్సేపు దగ్గర కూర్చోపెట్టుకొని వారి పాఠాలు గురించి అడిగి వారి సమస్యలు తీర్చేది.

ఇరుగు పొరుగులు జానకి గురించి కుతూహలం చూపించినా సారధి గాంభీర్యం, జానకి ముఖావంతో, ఆ విషయమే మర్చి పోయారంతా.

3

మధ్యాహ్నం భోజనానికి వచ్చిన సారధికి డైనింగ్ టేబిల్ మీద కంచం వాల్చి అన్నం కూరలు వడ్డించి ప్రక్కగా నుంచుంది జానకి.

పప్పు కలుపుకొంటూ "నేయి ఘుమ ఘుమ లాడుతోంది – కాచావా ?" అన్నాడు.

"లేదు. మన ప్రక్క ఇంటి తాసీ రామమ్మగారు పంపించారు. అక్కడికీ వద్దండీ.... తినేవాళ్లు కూడా ఎవరూ లేరు – అని అన్నాను దానికి ఆవిడ గారు, తినక పోతేనేం పిల్లలకు ఏ మైసూరుపాకో చేసిపెట్టు – అంది"

తలెత్తి జానకి ముఖం క్షణకాలం చూచి "జానకీ, ఇది పల్లెటూరు. చాలా సున్నితమైన మనస్తత్వాలు.... వాళ్లు ప్రీతితో ఇచ్చిన దానిని తిరస్కరిస్తే అభిమానాలు గాయపడుతాయి అన్నట్టు.... ఈ వేళ గాయత్రి దగ్గర నుండీ ఉత్తరం వచ్చింది. పిల్లల్ని ముగ్గుర్నీ తీసుకొని, కొన్నిరోజులు వుండడానికని వస్తోందిట" అన్నాడు సారధి.

భయం లాటి భావం క్షణకాలం జానకి ముఖంలో తొంగి చూచింది.

చారు పోస్తూ "గాయత్రి అంటే మీ చెల్లెలు కదా ?" అంది.

'అవును - బాగా వున్న ఇంటి వాళ్ళ కోడలు. పుట్టినింట అతి గారాబంగా పెరిగింది. దాంతో అత్తారింటికి వెళ్ళాక గారాం తోనే కాస్త మొండి పట్టునో టి దురుసు అబ్బినట్టున్నాయి ఇంట్లో మామూలుగా మాట్లాడినా మాట్లాడినట్టు నాలుగిళ్ళవతలికి వినవస్తూంటుంది గొంతు. ఆడపిల్ల వున్న చోటు సద్దు వినపడకూడదని ఎంతగానో మందలించేది అమ్మ.... పైగా పిల్లలతో వస్తోంది. వాళ్లసలే సిసింద్రీలు .. గాయత్రికి తీపి వంటలు, విరుతిళ్లు మహా ఇష్టం.... "చెప్పుతుం. ముగించి పెరుగు జుర్రుకొని, చేయి కడుక్కుందుకు అవతలకి వెళ్ళి పోయాడు సారధి.

వక్కపొడి డబ్బా బల్ల మీదుంచి కంచం తీసేసి ఎంగిల్లు శుభ్రం చేసింది. జానకి.

గాయత్రి అత్త, అని పిల్లలిపిలు చెపితే వినడమే కానీ ఎప్పుడూ చూడ లేదు జానకి. పైగా ఆవిడ స్వభావం టూకీగా సారధి నోటి వెంట వినేసరికి గుండెలో కాస్త గుబులనిపించింది. మనసు దిటవుకొని "గాయత్రి వాళ్లు ఎప్పుడొస్తున్నారు ? " అంది.

(ఇంకా వుంది)

